కింకరమా ! దాక్షిణ్యమా! అభిమానమా! నను జేరరారే!ధర్మ మార్గవిరామా! పాపనిచయధామా! ఘోరకార్యసంభీమా? ఓపా పిరామా! నీవేల బ్రతికితివి ? సీతా! సీతా! సీతా!

(మూర్ఛపోవును)

---

## తృతీయరంగము రాజనగరు

శ్రీరాముఁడు మంచముపైఁ బరుండియుండును, సేవకులు గుసగుసలాడుచు భయము నొందియుందురు.

[ప్రవేశము : లక్ష్మణ భరత శత్రుఘ్నులు దూరమున]

భరత - లక్ష్మణా ! ఈయకాలమున రాముఁడేల మనలబిలిపించియుండును ? మన మిప్పుడేకదా యతనితో నాజ్ఞగైకొని పోతిమి ? అంతిలో నేమి విశేషము నడిచియుండును ?

లక్ష్మణ—భరతా! అదియేమోకాని అన్న పిలిపించినప్పటినుండియు నాహృదయమున చెయివెట్టి కలచినరీతి సంతాపమగుచున్నది. అల్లదే! చూచితే శ్రీరామచంద్రునిమోము మధ్యందినార్కబింబముచెంత నున్న చంద్రబింబమువలెభయంకరముగనున్నదిగాని పూర్ణిమాచంద్రునిరీతి నాశ్రితుల కాహ్లాదముఁ గలిగింపకున్నది. అదియుగాక సేవకజనంబులు భయభ్రాంతులై కదల మెదలనేరక యున్నారు. రాజనగరంబంతయు నిద్రపోయినరీతి నిశ్శబ్దముగ నున్నది. ఇంట నింతైన సంతసము చూపట్టరాదు.

శత్రు—అగ్రజా! చూచితివే మనోహరసరోజకాంతిని మాపఁజాలి, నిజసంచలనమాత్రమునముల్లోకముల నేలజాలు నిడుదకనుదామరలి నుండి యశ్రుజలంబులు దరిద్రునిసుగుణంబులరీతిదిగజారుచున్నవి.

రావణాదిప్రతిపంథుల మాఱ్కొనునప్పుడైన, ఇంద్రజిత్తునాగ పాశంబులకుఁ జిక్కినప్పుడైన గలుగని చింతాభరం బీమహా నీయున కీనాఁడే గలిగియుండును?

లక్ష్మ—ఆహా! ఇదియేమో జగత్త్రయము కాఁగలదని తోఁచుచు న్నది. పరమశాంత స్వరూపమగు శ్రీరామమూర్తి చూపరులకు దేరిచూడరానట్టి భయంకరమూర్తియై, అంతరమందు శోక మూర్తియై యున్నవాఁడుకదా?

భర—సమక్షమున రాయబార మేల? పోయి అన్నకు నమస్కరించి తెలిసికొందము రండు. వచ్చినయాపదలు వలదన్నఁ బోవునే?

(అందరునుపోయి నమస్కరింతురు. శ్రీరాముఁ డూరకుండును.)

లక్ష్మ—అన్నా! ఇదేమివిపరీతము! ఆశ్రితసంరక్షణదరహాససుందరం బగు నీసుందరవదనారవిందము వాడియుండు టీరేడులోకముల దురదృష్టమేకదా! మావలన నేమైన నపరాధము కలిగెనా? ప్రజలకేమైన నాపదసంభవించెనా? వచియింపుము. నీదాసుఁడగు నేనుండ నీవింత చింతిల్లనౌనే?

మ. తలపో, తాపమొ, లోపమోయధికచింతాభారమో, శోకమో అలుపో, మాయపరాధమో ప్రజలపాపాసూయయో, కాలమో తెలుపన్ రాదో, వినంగరాదో, యిటులార్తించెందెదేమన్నయా కలుమంబే వచింపుమన్న మనలన్ కాదన్న నే మ్రొక్కెదన్!

భర—అగ్రజా! నీవు చింతిల్లిన లోకము చింతిల్లదే! నీ యనుగ్రహా మునకై కాచుకొనియున్న మాయం దింత యనాదరణ మొన ర్చుట నేఁడేమో యద్భుతముగ నున్నది. మాపైకరుణాకటాక్ష ములు ప్రసరింపఁ జేయుము.

శత్రు—అన్నా! వీరందరు ప్రజ్ఞావంతులు. మీయానతి ననేక కార్య ములఁ జేయుచుండెడివారు, వీరెందైననపరాధములుజేసియుందురు,

నే నేమియు నెఱుఁగనే? నాయందేటికి కోపము? నేనువచ్చినవెం
టనే చెంతకుఁ జేర్చియెంతయోనిండారుప్రేమతోమాటాడించుచుం
టివే? నేఁడు నేనొనర్చిన తప్పైనదేమి? (అనిపాదములపైబడును)

శ్రీరామ—శత్రుఘ్నా! లెమ్ము. (లేవనెత్తి) పరమసుస్వభావులగు
మీయందపరాధమున్నదన్న నాపరమాత్మయందు దోషమున్న
దన్నట్లేకదా? తమ్ములారా! మీయందు నాకుఁ గోపముగలదే?
కూర్చొనుఁడు.

లక్ష్మ—అయినమమ్ములనీసమకాలమునందుపిలిపించుటకుగారణమేమి?
మోము కాంతింబాసి విన్నవోయి యుండుటకుఁ గారణమేమి?

శ్రీరామ—సోదరులారా! నాయాజ్ఞ యన మీకెట్టిది?

భర—శిరసావహింపఁదగినట్టిది.

శ్రీరామ—అయిన దానిని మీరు తప్పరుకదా?

లక్ష్మ—మాశరీరమునుండి జీవము తప్పిన తప్పునేమో కాని మీయా
నతిఁ దప్పువారమా? రామా! ఇవేటి క్రొత్తమాటలు?

శ్రీరామ—అట్లయిన మీలో నెవ్వరైనను రేపు తొలిజామున నే
మీవదినె జానకిని భాగీరథీతీరారణ్యమందు విడిచి సూర్యుఁడు
మధ్యాహ్నగతుఁడగుటకు ముందే పురిఁజేరవలయును. ఇది నా
యాజ్ఞ. దరికి రండు మీలో నెవ్వరీకార్యముఁ జేయుదురు?

అందఱు—రామా! రామా! రామా! ఏమి? ఏమి యీవిపరీతాజ్ఞ?
ఏమికారణము? ఇట్టియాజ్ఞ యెందైనగలదా?

శ్రీరామ—నాతమ్ములు మీరైనయెడల మారాడక నాశాసనములు
నిర్వహింపుఁడు.

భరత—దేవా! కారణ మడుగకూడదా? నిష్కారణముగ మాతల్లిని
నడవులఁద్రోసి జగత్ప్రళయము చేయుదువే?

శ్రీరాము—సోదరా! భరతా! నీవు వచింపరాని కారణము నా కున్నదా? కట్టా! మఱల నా వ్యసనము నన్ను ముంచునుగదా యని మసలితివి సహోదరులారా! (అనుబంధము 10)

కటురండు. (వారిపై వ్రాలి) మనయూరనున్న నొక చాకలివాఁడుతన భార్యపై సందేహించి దాని నిల్లు వెడలఁగొట్టగా కొందఱు పెద్దలు భార్యను పరిగ్రహింపుమని వానికిఁ జెప్పిరట. అందులకువాడు నే నేమి రాముఁడనా! పగవాని పక్కపని యేండ్లు పడియున్న భార్యను పరిగ్రహించుటకని కర్ణకఠోరములనుడివెనఁట, ఆయపవాదమునా దేహమును కాల్చుచున్నది, కావున మీ రావదినెను ఘోరారణ్యమునడించి రమ్మని మీకాజ్ఞ నిచ్చితి. నామాటకు మాఱాడకుఁడు.

భరత—ఇంత కింత కావలయునా? ఎవఁడో యొకఁడు త్రాగుబోతు బుద్ధి స్వాధీనము లేక పలికిన దుర్భాషలకై, అయ్యో! సంపూర్ణ గర్భవతిని, పరమపావనాకృతిని, లోకజనయిత్రిని జానకీదేవిని నట్టడవిని విడువదగునే? ఆచాకలివాని మాటలు ప్రమాణములా? బ్రహ్మమహేశాది దేవవర్గముల యెదుట అగ్నిగుండమునుండిపరిశుద్ధయై వెలువడి వచ్చిన యాపరమసాధ్వీమణి పాతివ్రత్యము ప్రమాణమా? నీవే యోచింపుము. అన్నా! నీకు జెప్ప నేనెంతటివాఁడను?

చ. జనకునికూర్మిపుత్రి, వరసారసబంధుకులంబుకోడ ల
త్యనఘుత రామచంద్రు సహధర్మిణి, మామకపూజ్యమాత శ్రీ
వనితపరావతార మభివర్ధితవేదవనాంతకీరమా
జననిని నిందలాడ నపచారముఁగాదె దలంపరాఘవా?

శ్రీరామ—ఈవిషయమును మాటలాడకుఁడు. ఇది నా నిర్ధారణము. భూమ్యాకాశములు తిరిగినను నిది తిరుగజాలదు. ఊరక వచింపకుము, నీవేమి? నాయాజ్ఞతి చేసెదవా? లేదా?

లక్ష్మ — స్వామీ! ఇది యేమి లోకనాశనకాలము సమీపించినదో బ్రహ్మప్రళయము కానున్నదో తెలియదు. రామచంద్రా! సీతా మాతనా నీవు సందేహించెదవు? అంత సందేహించిననామె ప్రస వించువఱకు నొక్కరమ్యసౌధమున నుంచుము పిదప పుట్టినింటికిఁ బంపుము అడవికిఁ ద్రోలవలయుననెడి క్రూరకార్యమేల?

సీ. అగ్నిగుండమునఁ జొచ్చి యతిసాధ్వియన నెల్ల
జగముల సత్కీర్తి చాటలేదె
బ్రహ్మాదిసురులు సత్పావని యనుచు నీ
దేవి వేనోళ్ళ నుతింప లేదె
మనతండ్రి దశరథమును జేరుఁ డీసీత
కులదీపక యటంచు పలుక లేదె
అలనాఁడు, అనసూయ యతిశయంబుగ మాతో
యీసాధ్విచరిత వర్ణింప లేదె

గీ. స్మరణకును రాదొ, తెలియదొ మాంద్యమేమొ
రాముడవొ, కావొ, మాదు దుర్ప్రాప్తియేమొ
నిజము కనుపున్న, యపనింద నిక్కమన్న
మము, ప్రజలను, కులమును మనుపుమన్న.

శ్రీరామ — లక్ష్మణా! హెచ్చైనచను విచ్చినందుకా యిట్లుమాట్లాడె దవు? మీరీ కార్యముఁ జేయకున్న నేనేయిందుకు పూనెదనుగాక అయ్యో! గ్రహచారసమయమున నెక్కడి తమ్ములు? ఎక్కడి బంధువులు? ఎవని పాపము వాఁ డనుభవింపవలయునుగాఁక.

శత్రుఘ్ను — అన్నా! నామాట?

శ్రీరామ — శత్రుఘ్నా! నీవు మాటాడిన నాయానకలదు.

లక్ష్మణ — అన్నా! మేము నీయానతిఁ జేయమని యంటిమా? ఇది ధర్మమా యనియంటిమి?

శ్రీరామ—అటులైన మెచ్చితి ఏమి నీకు గావలయును. చెప్పుము?

లక్ష్మణ—నాకు కరుణయు నభయమును గావలయును.

శ్రీరామ—కరుణ కలుగదు, రాదు. రా జాలదు.

భరత—ధర్మవిమర్శన మిమ్ము.

శ్రీరామ—ధర్మమిదివరకే విమర్శింపబడినది మఱల నది కాజాలదు.

శత్రుఘ్న—నాకు కాలవిలంబ మిమ్ము.

శ్రీరామ—అరగడియ నిచ్చెను.

లక్ష్మణ—అన్నా! నీవు నేడు రాముడవు కావుసుమా! క్రూరహింసయే? గర్భవతీమారణమే? అగ్నిసాక్షిగ పాలించెదనని నీ వొసర్చిన ప్రతిజ్ఞకుభంగమే? విమర్శనము జేయక, పాతకోపబాధితుడవై తమ్ములమాటల చెవినిడక, నీవుచేయు సకలలోక నిందాకర, పాపకర, పశ్చాత్తాపకర, హింసాకార్యమునకు దోడు మాకును ఘోరదుష్కృతవిషజ్వాలలఘటింప జూచెదవే? ఎందు బోయె నీధర్మము? ఎందుచనియె నీజ్ఞానము? నీవిట్టివాడ వగుదువని యొక్కనాడైన నేనెఱుగను, రామా! ఏల తేనెబూసినకత్తికైవడి మమ్ముల రౌరవాదినరకములలో బడద్రోసెదవు? అంత నీకు కనుబ్రేగైన నీ నిశితఖడ్గధారచే మాశిరంబుల గైకొమ్ము సంతసమున నిచ్చెదము.

శ్రీరామ—ఔరా! లక్ష్మణా! నీవు నాకుదమ్ముడవా? కటికపగదాయి వగుదువుగాక, నన్ను దూరెదవా? నాకు జ్ఞాన ముపదేశించెదవా? భార్య లోకనిందనీయురాలయ్యె. తమ్ములు పగతులైరి. ఛీ! మీముఖములు జూచిన పాపకరము. నేనేపోయెద. మీకేల కష్టము. మీరు నాకు దమ్ములుకారు పొండావలకు.

శా. ఘోరా! సోదరుడౌదువే? కఠిన నీచాలాప సంతాప కృ
ద్ఘోరాకార విరోధివౌదువు నిను న్దూరంగ నేలా? మహా
క్రూరంబో విధి చాలదయ్యెఁ; యనుజల్ గూడంపుశస్త్రావళుల్
కారే! వారిని విశ్వశించితిని శిష్టాత్ముండనై యక్కటా!

లక్ష్మ.——(రాముని కాళ్ళబడి) అన్నా! క్షమింపుము. పసితనమున కన్నుమిన్నెఱుంగక మాతల్లియందుగల ప్రేమచే మహత్తర శోకావేశమున నేమియో మాటలాడితిని. నాయపరాధమును మన్నింపుము. ఇదె నీయానతి చేయువాడ. ఆనతిమ్ము.

శ్రీరామ——(లేవనెత్తి కన్నీరు విడచుచు) లక్ష్మణా! నాకీలోకమే పాడై తోచుచున్నది. ఈ సౌధమును గిరగిర తిరుగుచున్నట్లున్నది. ఇంద్రియములు నావశముగాకున్నవి పొమ్ము. హా జానకీ! జానకీ! (మూర్ఛిల్లును)

(యవనిక పడును)

# లవకుశనాటకము

※ ※ ※

## తృతీయాంకము

### ప్రథమరంగము

సీతాంతఃపురము ముందర పగడసాల

[ప్రవేశము : లక్ష్మణుడు]

(అనుబంధము 11)

సీ. పూర్ణగర్భిణి కాన పోద్రోసి యిహపర
 దూరుఁడై నరకంబుఁ జేరనయ్యె
చెప్పగా రాముండు చేసి యీపాపంబు
 శోకమే కన్నులఁ జూడనయ్యె
తల్లులఁ దమ్ముల తల్లడిల్లగ జేసి
 కులపాంసనుండనై తొలగనయ్యె
సాకేతపౌరులు శాపాగ్ని దహియింప
 జీవచ్ఛవంబనై చెలఁగనయ్యె
గీ. ఎదరు రానయ్యె నపకీర్తి పడగనయ్యె:
 చెనటి స్త్రీహత్య శిశుహత్య చేయనయ్యె;
 వంత విడదయ్యె; రఘుకుల మంతమయ్యె;
 జగతి దుఃఖపు చావింక చావనయ్యె;

ఆహా! లోకమునఁ బాపములకెల్ల నావాసస్థానముగ నా బ్రహ్మనన్ను సృజించె కాబోలు? నన్ను కడు ప్రేమ వెలరారఁజూచి కాపాడు తల్లిని, మా సుమిత్రా దేవితో నేమిటి,దక్కువకాని జననిని, కోప మనునది తెలియక నిరతానుగ్రహారంజిత కరుణాకటాక్షముల

బ్రహ్మాదుల నేలఁజాలు లోకజనయిత్రిని, మా సీతామాతను నా చేతులార నేనడవి నెట్లు డించివత్తును ? అక్కటా ! శ్రీరాముఁడు నిన్న భాగీరథీతీరమునందలి మునిపల్లియలయందు విహరింప సెల విచ్చియున్నాఁడని వచించిన వెంటనే మా జానకీదేవికిఁ గలిగిన సంతస మింతింత యనరాదుగదా! అప్పుడే పురమునందంతయు నీ దుస్సహాశోకరోదంతము వ్యాపించియున్నది. పురజనులందరు గజి బిజిగ లోకమే మునిగినట్లు తలంచి, కన్నీరు మున్నీరై పార, వీధు లందు గుంపులుగుంపుగ చేరి పరితపించుచున్నారు. అయ్యో! ప్రజ లందరు నన్నెంత కఠినాత్ముఁడని దూషింతురో కదా ? అలనాఁడు మే మయోధ్యాపురముఁ బాసి యరణ్యమునకుఁబోవునపుడు సుమం తుని నే పరిపరి నిందించినవాఁడు పరమపాపమున కొడిగట్టిన నన్ను నిందింపక మానుదురే! అయ్యో! ఉత్తమగజములు నిర్హేతుకము గనే తమ శుండాగ్రముల వంచి భూదేవినిఁగూర్చి మొరఁబెట్టు చున్నవోయనునట్లు తమదుఃఖములు సూచింపుచున్నవి. పెంపుడు పక్షులు, చిలుకలు, హంసలు మేల్కాంచిన వెంటనే ముచ్చటగ తేనియలొలికెడు పలుకులు పలుకక క్రిందబడి పొరలాడుచు, తల్లి లేని పిల్లలకై వడి తల్లడమొందుచున్నవి. కామధేనువులు ప్రాతః కాలపూజలనించుకేనియు నాశింపక కట్టినస్థలములందే తమ తమ యాహారమ లమూని శృంగాగ్రముల విదలించుచు, ముఖముయెత్తి కొని శోకించుచున్నవి. లేదూడలు లేపచ్చికల పారదోలి అంబా రవములుచేయుచు నమితదుఃఖమును ప్రకటించుచున్నవి. వేయేల భూమిపై బారు చీమలుసైతము పుణ్యాత్ములు తమకిచ్చు నూక లను తినక, కాళ్ళక్రిందఁబడి చావ నుంకించు చున్నవి. ఇదియం తయు లోకసహజమేకదా? బుద్ధిలేని సర్వజంతువులును మాజానకీ దేవిని విడువఁజాలక దుఃఖించుచున్న నాదేవదేవి, నాజనని లోకైక జననీత్వమును సూచించుచున్నదిగదా, అదే సూర్యుఁడుదయించు

చున్నవాడు ఇంకను మాజానకీదేవి రాదయ్యె. నానోసట వ్రాసిన యనుభవము ననుభవింపక తీరునా ?

[ప్రవేశము : సీత వస్త్రాభరణములతో]

సీత—లక్ష్మణా ! ప్రయాణమునకు సిద్ధముగ నున్నాడవా ? నేను కొంచమాలస్య మొనర్చినందులకు క్షమింపుము. మునిపల్లెలందు మునిభార్యలకు గావలసిన సొమ్ములు చీరలు తీసుకొని వచ్చుటకు కాలవిళంబమైనది.

లక్ష్మణ—(స్వగతము) అయ్యో ! ఏమి యీ వెఱ్ఱితల్లి సంతోషము? తన్ను గాల్పనున్న యగ్నిని తెలియక తానే కౌగలించు కొననున్నదే! అకటా ! యిట్టి నిష్కల్మషహృదయ నడవిపాలు చేయనెత్నించిన పాపాత్ముడను నేనుగదా? (ప్రకాశము) తల్లీ ! యిదే సిద్ధముగ నున్నాడను, ఇయ్యదే రథము సర్వసన్నాహములచే సిద్ధముగనున్నది.

సీత—అన్నా ! సౌమిత్రీ ! శ్రీరామచంద్రునకు నాపై నేడెంత కరుణకలిగెను ? నేనెన్నఁడో కోరిన కోరికను నేడుకొనసాగింప దలచి నిన్నంపెగదా ?

లక్ష్మణ—(ఊరకుండును.)

సీత—ఏమిలక్ష్మణా ! ఊరకున్నాడవు ?

లక్ష్మణ—అమ్మా ! ఏమియు లేదు. ప్రొద్దెక్కెనని చూచుచు నూరకున్నాడను. రమ్ము పోవుదము. వేగమే వెడలవలయు. (నిష్క్ర)

---

## ద్వి తీ య ర ం గ ము

### అరణ్యప్రదేశము

[ ప్రవేశము రథముపై సీతాలక్ష్మణులు ]

సీత—లక్ష్మణా ! ఇదియేమి ఘోరారణ్యములకు వచ్చితిమి ? ఇది గంగాతీరమునందలి మునిపల్లియలకు మార్గము కాదే ? త్రోవ తప్పితివా? లేక నేనే మరచితినా ?

లక్ష్మణ—(స్వగతం) నేనేమి ప్రత్యుత్తరమిత్తు? అయోధ్యాపురము దూరమగునట్లంతయు నాధైర్యసారము దూరదూరమగుచున్నది. అరణ్యప్రదేశము దాపునకువచ్చినట్లంతయు శోకదవానలంబునా దాపునకు వచ్చుచున్నది. ఏమిచేతు? (ప్రకాశము) జానకీదేవీ! ఘోరకఠిన పాపకార్యారణ్యముల జరింపహేమ్మనివిధి నానొసట వ్రాసియుండ నరణ్యములు గాక యుద్యానవనములు నాకు దారి నివనిచ్చునే?

సీత—అన్నా! ఏమినీమాటలు నాకర్థముకాలేదు! పాపారణ్యమేమి చరించుటేమి? వివరముగా వచింపుము!

లక్ష్మణ—(తలవంచుకొని యూరకుండును)

సీత—సౌమిత్రీ! ఏమి యూరకున్నాడవు! ఏల నీ యాననాబ్జము కళావిహీనమై ప్రతిపదియందలి చంద్రునివలె మాసియున్నది? లక్ష్మణా! వచింపుమా; నామానసరాజీవము సందేహవారి పూరంబునంబడి పరితపించుచున్నది, (నిమిత్తములను చూచి) అదేదుశ్శకునములు కనిపించుచున్నవి. ఈ దినము వెనుకకు మఱలిపోవుదము మఱల శుభదినముజూచి ప్రయాణమైనత్తుమట లెమ్ము లక్ష్మణా కంటివే! అమంగళసూచకంబులగు జంబుకములు మన తెరువంక పరికించుచు నశ్రావ్యధ్వనులను జేయుచున్నవి. నభోమణియగు సూర్యుడు ప్రకాశింపక, గుణములేనివాని విద్యాధనమువోలె మాసియున్నవాడు! పగటికాలముననే చుక్కలు పెక్కులు భూమిపై వ్రాలుచున్నవి! అల్లదే! చూచితివే! మనరథమునకు గట్టినయుత్తమాశ్వము లకారణముగ కన్నీరు విడచుచున్నవి. నామానస మేటికోనావశముగాకున్నది. అన్నా! నీకన్నుల నీరేల గ్రమ్ముచున్నది?

శా. మున్నా రావణు ఘోరశక్తిని ధరన్మూర్ఛిల్లుచో నాజిలో
సన్నాహంబున నింద్రజిత్తును వడిన్ జక్కాడుచో దైత్యులన్
ఛిన్నాభిన్నము చేయుచో నరయుగా చింతింప వోలక్ష్మణా!
గన్నీరేటికి గల్గె తండ్రి; చెపుమా కళ్యాణులే యందరున్.

పరితపించుచుంటిని అదియు నాదౌర్భాగ్యవశమున నీ నిశితవాక్య ఖడ్గంబునకు నన్ను పాత్రునిఁ జేసె. తల్లికో! నీకుమదికెక్కిన శిక్ష విధింపుము. వలదనను; కాని నీనిందాభాషణ క్రూరకరవాలము నకు మాత్రము నన్నప్పగింపకుము. నే పరమపాపుఁడ, పరలోక దూరుఁడ పశ్చాత్తాపమున నెట్టిదో యెఱుఁగనివాఁడ.

(అనుబంధము 12)

సీత—అన్నా! స్త్రీచాపల్యమున, ఆతురభావమున, పరిశుద్ధమానసుడ వైన నిన్నెన్నియో నొవ్వనాడితిని క్షమింపుము. తండ్రీ! ఏమి ఏమి, శ్రీరాముఁడు నా పైనున్న మమత నంతయు వీడెనా? (నిశ్చేష్టయై) నే నే మపరాధ మొనర్చితి? నే నేమి చేయరాని చెయిదములఁ జేసితి. లక్ష్మణా! మనము వేగిరపడుచున్నది; శరీ రము తూఁగాడుచున్నది. చెప్పుమా! చెప్పుమా! ఉదంతమంతయు సవిస్తరముగఁ జెప్పుమా.

లక్ష్మణ—జననిరో! నానోటినుండి తదుదంతము వచింపజాల!నీ యాన తియు మీఱజాల. ఇంకేమి చేయుదు? లోకాపనిందకు తాళలేక నీనాథుడు నిన్ను ఘోరాటవిని విడిచిరమ్మని నన్నాజ్ఞాపించెను.

సీత—(ఆతురముగ) లోకాపవాదమా! నాపైనయా! ఎవ్వరు! ఏ వేళ ఏయపనింద మోపిరి? ఎవ్వరీ దంపతుల బాపుట కొడిగట్టిరి?

లక్ష్మణ—అమ్మరో! ఎవ్వడో మద్యపాసియగు నొకచాకలి తగవు లాడిపోయిన తనభార్యను పరిగ్రహింపుమని యూరివారు చెప్ప "నేనేమి రాముడనా పరవాసియైయుంటనున్న భార్యను పరిగ్రహిం చుటకు" అని నుడివెనట. దానికై శ్రీరాముడది యొక కొండగా మార్ఖ్యముపట్టి నిన్నిచట త్రోచిరమ్మని నన్నంపెను. నా ప్రాణ ములనైత మీఘోరకార్యాచరణమున గలిగిన పశ్చాత్తాపమున నిచే యడవిని ద్రోయ నన్ను నియమించెను.

సీత—హా! రామా! రామా! (మూర్ఛిల్లును.)

లక్ష్మణ—అయ్యో! ఈతల్లి మూర్ఛిల్లె, (శైత్యోపచారముల జేయుచు) అహో! ఇంతదుఃఖమునకు మూలము నేనుగదా! ఈసంతాపమెట్లు భరింతును? ఈతల్లి సంతాపము నెట్లు తిలకింతును?

సీత—లక్ష్మణా! లక్ష్మణా! (లేచును)

లక్ష్మణ—అమ్మా! ఆపాపి లక్ష్మణు డిదే యిందేయున్నాడు. ఇంకను జీవించియేయున్నాడు. (అనుబంధము 13)

సీత—లక్ష్మణా! శ్రీరాముడు తన నోరార యీమాట లాడెనా! నానాథుం డిట్టి యపోహావార్తను విని నమ్మగలిగెనా! నాపైనున్న మమతయంతయు తొలగెనా? ఇది యంతయు తథ్యమని విశ్వసింప గలిగెనా! ఇది నిజమా! రామా! తారకనామా!

సీ. చిన్ననాటనుగోలె నిన్నె దైవముగాగ
నెన్నియుండిన భక్తి, నెన్నవలదె
అల రావణునిబాధ లన్ని నేనోర్చి నీ
కొఱకనై మనుట యిం తరయవలదె
బంధుల రాజ్యంబు, బాసి నేనీవెంట
కానకువచ్చుట కాంచవలదె
అనదయే, దీనయే, అబల గర్భిణియంచు
నను బ్రోవ సత్కృప కలగవలదె

గీ. మనసు రాయియె నీకు నో మనుజపాల
భువన నుత నామ రవికులాంభోధిసోమ
దానవవిరామ సత్కృపాధార సీమ
రమ్యగుణధామ శ్రీరామ రామరామ.

లక్ష్మణా! శ్రీరాముడు, నామనః కాముడు, ఆనందధాముడు, నన్ను సందేహించెగదా? నీయట్టివారు చెంతనుండియు ఇదితగదనియు

నిట్టిది కలదాయనియు! జెప్పకపోతివా! శ్రీరామా! ఆ బాల్యమునుండి
కడుప్రేమనిండార, పెన్నిధానమునవలె, ప్రాణసమునవలె నన్నెంతో
యు యరయు నామనోనాథుడే నాకిట్టి యపకారము నొనరించి నట్టడవిని
ద్రోయ నింకెవ్వరు చెప్పువారు! ఇంకెవ్వరు నమ్ముచువారు!
అయ్యో! 'రామ' 'రామ' యనెడు రెండక్షరములజపము చేయుచున్నను
'రామ' యనినుడివినవారి నాత్మబంధువులుగా నెంచుచును ఆ రామ
మూర్తినే మానసకమలాసనమునకు పీఠమునసిడి దైవముగాఁ బూజించు
నామనశ్శుద్ధి నించుక నరయడాయెగా! శివధనువు దునుమాడిన వేళ
మొదలు సహకారసల్లాపములనుగాని, శైశవక్రీడావినోదము విడ
నాడి, జననీజనకుల గారాబులాలికేసి సుసంపుష్పలకులనైన తృణీ
కరించి పుట్టినింటివాసమును త్యజించి; ఆత్మబంధువుల నావలద్రోలి
తన్నే సర్వస్వముగా భావించు నామనస్థైర్యము తెలియడాయెగా!
తానడవి కేగుతఱి, ముఱిపెంపు రాయంచల లేపలుకుల కులుకు
జెందుదాననయ్యు సింహశార్దూలాది ఘోరమృగారావములకైన
నోర్చి. సంపెంగ తేనియల కాలువల దాటుట కెంతయో ప్రయా
సము జెందుదాననయ్యు దుస్తరభాగీరథీ ప్రవాహసంతరణంబున
కైననోర్చి. భీకరారణ్యముల తనవెంటరా, తన్నే ప్రార్థించుట
యోచింపడాయెగా! నాయాత్మశుద్ధినరయగోరి, 'అగ్నిజ్వాలలపడు'
మని తననోటినుండిమాటవచ్చినను రాకమునుపే భీకరానలంబున
బడుటవిచారింపడాయెగా! అజరుద్రాదులు నాసౌశీల్యపాతివ్రత్య
ములచాటించి యుగ్గడించుట నైతముకనుగొనడాయెగా! వినోదము
చేయుచు తాను కనుపింపకపోయినపుడు నదియే జగత్ప్రళయమని
భావించు నాప్రేమను తలపడాయెగా! లంకలోనుండునప్పుడైన ప్రళ
యార్కబింబముబోలె, నొక్కరికి తేఱిచూడరాకుండ కాలరుద్రుని
కంటిమంటవలె నెవ్వరికిని చేరరాకుండ నాత్మపాతివ్రత్యమును
కాపాడుకొన్న నాసాధ్వీచారిత్రమునించుకైన మదినిగొనడాయెగా

సౌమిత్రీ! అంత తనకు గోపమున్నఁ బరుషరవాలమున నింతింత ఖం
డించియైనను బరమసంతోసమును భరింపుచుంటినే! నే మని యుం
టుట తన కిష్టము లేకున్న, హాలహలవిషము తనచేచేత నిచ్చియుం
డిన నదియే పరమామృతముగ గ్రోలుచుంటినే! నే నెంత కనుమ్రవే
గైన మఱల 'నండుమన్నిగుణాఢ్యమున సతి నుతియు' మని శాసించి
యున్న నాతని సంతోసమునకై పడుచుంటినే! అయ్యో! నా
కియ్యాలించువారలేని లోకనిందను నాతల్లనైననిడి, నవమాసాంత
ర్వర్తినై యున్న నన్నుఁ దప్పు త్రోసెకదా! నే నెట్లు భరింతును!
ఎవ్వరితో మొఱలిడుదు! ఏమహాత్ముల శరణొందుదు! అకటా!
నా పైదయ లేకున్నను నాగర్భమున వృద్ధినొందుచున్న నా శిశువు
నందైనఁ గనికరము లేకపోయెగా! అయ్యో! పరమశాంత
శ్రీనిధియగు శ్రీరాముఁ డిట్టివాఁడని భావించి యుంటినిగాని కఠిన
స్త్రీశిశుహింసకుఁడగునని యెక్కనాఁ డెఱుఁగను. నిరుపమాన
సద్గుణభూషితుఁ డని మాతండ్రి జనకుఁడు కన్య నిచ్చెగాని యిట్టి
గోముఖవ్యాఘ్రమనియు, నిట్టిగంధము పూతకత్తియనియుఁ దెలి
యకపోయెగదా! లక్ష్మణా! ఇక నీవు పొమ్ము, తండ్రిరో! నీవదినె,
నీవు భక్తి సేవించుజానకి నీఁక మఱచిపొమ్ము. మాయత్తగారగు
కౌసల్యాసుమిత్రాదిదేవులతో నాకడపటి యభివాదముల వచిం
పుము. తమకుఁ జెప్పక వచ్చినందున తగుఫలమనుభవించితి ననియు
'మీకోడలగు సీత మీయెడ నేమి యపరాధము జేసియున్నను
మన్నించి బ్రోచిన మరణవేళ సంతోషమున బ్రాణముల విడుచు
ననుము. అన్నరో! భరతశత్రుఘ్నులకు నాయాశిషంబుల దెలు
పుము, 'మీశుశ్రూషల, మీభక్తిపూజల, మనసార గైకొను
భాగ్యము లేదయ్యెనుగాని మీవదినె సీత ప్రసవించి ప్రాణముల
విడువనున్న' దని చెప్పుము. అన్నరో! మీయన్నతో, సీత, నీవు
దృణీకరించిన సీత, నీయట్టివానికి సైతము నిష్కరుణ గలిగించిన

నిర్భాగ్యపుసీత, సమభక్తిభావనతో నీపాదారవిందములనే ధ్యానించుచు, నీవుచేసిన మహోపకారమును మదిదలంచుచు, నీ దయాగుణమును కొనియాడుచు ప్రాణములబాసె'నని వచింపుము.

సీ. అరయ కౌసల్యాది యత్తల నడిగి నా
వందనంబుల నీవు పలుకు మన్న
భరతశత్రుఘ్నుల కరయ నాకడసారి
దీవనలను నీవు నుడువు మన్న
మా రామచంద్రుతో మరణవేళను తన్ను
నడిగితినని నీవు నుడువు మన్న
ఇంకనైన నపకీర్తి యేమియు లేక తా
హాయిగ నిద్రింపు మనగదన్న

గీ. తన్ను దైవంబుగా నమ్మియున్న కాంత
కకట ప్రతిఫలంబిదియె యంచ గదన్న
తనదు యుపకృతి మరువనెంచ గదన్న
మహిని యీజానకి నింక మరువకన్న.

'చాకలివానిమాటలే వేదమంత్రములుగా దలంచిన నీదయారసమును మిక్కిలికొనియాడె' నని తెలుపుము. ఇకనైనను చల్లగ నిద్రింపుమనుము. ఏయపవాదమును లేక సుఖముగానుండుమనుము తనకే దయగలిగిన చచ్చి పరలోకముననున్న నన్ను నెపుడైన స్మరింపుమనుము. జన్మజన్మాంతరమునందైనను నిన్నే తనకు పతిగా చేయుమని వేనవేలు దేవతలకుమ్రొక్కె ననుము. ఏదిలేకున్నను చచ్చునపుడొకటి ప్రార్థించితిననియు, ఆ వేదన మాతండ్రి జనకరాజునకు జెప్పి పంపుమనుము దివ్యనీలనీరదసంకాశమై, నీరజవిలాస సుందర నేత్రారవిందమైన తనమూర్తిని నామానసమున ధ్యానించుచుంటి ననుము. నాయందు చూపినదయ నింకెవ్వరి యందును చూపవలదని మాత్రము ప్రార్థించితి ననుము. తనమనసునకు దెలియని లోకనిందల నమ్ముట ఆత్మసాక్షి లేదా యనియు, మానస

శుద్ధిని క్షణక్షణమును తెలుపు అంతస్సాక్షి లేదాయనియు, సర్వ
కార్యముల నిద్రయుం దెలియుచు మానవుని కాపాడగల జీవ
సాక్షి లేదాయనియు, తానెంతనిందనాపై మోపినను వారైన
నాపరిశుద్ధత నొకప్పుడైన తెలుపుదురని వచించుచు నాయంత్య
కాలపాదాభివాసము జేసి నాజీవితమును తనపాదములకు కానుకగా
సర్పించితినని నుడువుము లక్ష్మణా! పోయిరమ్ము.

అన్నా! నేనెంత నిన్ను నొవ్వనాడియున్నను వానిని మదియందుంచ
కుము. నీ యుపకారము నీజన్మమున తీర్పంజాలక పోయితినిగదా?
ఉత్తరజన్మమునసైనం దీర్తునంట లెమ్ము. నాకై యెంతయోకష్టిం
చితివి. నాకై నిద్రాహారముల మానితివి. వాటి నన్నింటిని నే
మఱువను. కన్నపుత్రునిబోలె నున్న నీతో మాటలాడనైతిని.
నిన్ను గన్నులార [illegible]నైన జూడనైతిని. అకటా! నాకెవ్వరు
దిక్కు? నాగర్భస్థకుమారుల కెవ్వరుదిక్కు? ఓ శ్రీరామా!
తారకనామా! వైకుంఠధామా! నామానసకామా! రావే!
నామొఱాలింపవే! అయోధ్యా? ఈనాడు నీఋణము నాకు
దప్పెనా హా! రామా! రామా! (మూర్ఛపోవును)

లక్ష్మణ — అయ్యో! పరమనిర్భాగ్యలక్ష్మణా! నీవు నేడెట్టికార్యము
చేయ బాల్పడితివి? అమ్మరో! జానకీదేవీ! నావలననీకెట్టి యిడు
మలు గలిగె? దశరథరాజేంద్రుని పెద్దకోడలివై, విజ్ఞానధనుడగు
జనకరాజేంద్రుని కూర్మిపుత్రికవై శ్రీరామభద్రునకు పట్టపుదేవివై,
సకలప్రపంచమును రక్షించు తల్లివై, నీ వెట్టియిడుములంబడితివి?
నిన్ను నే నెట్లు నట్టడవిపాలుచేసి పోవుదు! విధిలేదు పోవనేవలయు
నా కానతిమ్ము తల్లీ! నిన్ను విడనాడి నేబోవుట యమపట్టణము
నకుగాని యయోధ్యాపురికిగాదు. (పోబోవ)

(అనుబంధము 1 *)

సీత—లక్ష్మణా! పోయెదవా? పోయెదవా? హా! రామా!

(అని పలుకుచు మూర్ఛిల్లును)

లక్ష్మణ—(మరలవచ్చి) అయ్యో! ఈ దేవి దుఃఖము నే నెట్లు తిలకింతును? శ్రీరామశాసన మెట్లు మీరుదును? నేనేల నా సుమిత్రకు జన్మించితిని? కట్టా! పుట్టినప్పటినుండియు పరపరనోలలాడునాయట్టివాని జన్మమే ఫలము సాధించును? అకటా! లోకములఁగన్నతల్లిని, అయోధ్యాప్రజలఁగన్నతల్లిని సమరక్షించుతల్లిని నే నెట బాయుదును?

సీ. జనకరాజేంద్రుఁడు జ్ఞానగర్భమునందు
చెన్నార పెంచుచునున్నతల్లి
పాలుపారు ప్రేమచే భూసతీమణి చెంత
ముద్దులపుత్త్రియై మొనయుతల్లి
చల్లనితల్లియై యెల్లరనొకమాట
యైననాడని శాంతమలరుతల్లి
పరిశుద్ధవజ్రంబుఁ బోలె నేదోషంబు
వేలఁజూపఁగరాక వెలయుతల్లి

గీ. కరుణఁ గలతల్లి లోకముల్ గన్నతల్లి
వేదములదల్లి వేద్యుల వెలయుతల్లి
తల్లులకుఁ దల్లి ముమ్మూర్తితనరుతల్లి
పరగ మాతల్లి మాతల్లి బాయఁగల నే.

ఓ జానకీదేవీ! అనవరతము రాజరాజులు, వారిచే వేఁగులు నిజశిరః కిరీటమణి మాలికలు భూమిసోక వందనంబులిడ మకుటమణిమయపీఠముల వెలరారు నీ పాదారవిందములు నేఁడు క్రూరమృగభక్షిత జంతుశవములపై ప్రకాశింప వచ్చెగా? సనకాదిమునిమానసేందీవరములపై శ్రీరామవామాంకపీఠముపై, వేదసీమంతినీసీమంతవీధిపై రాగరంజిత లీల భాసిల్లు నీ పావనశరీర మీ కంటకసముదయమున బడవచ్చెగా?

సీ. నినుజూచి కదల నేరని మృగంబులు నీకు
గాన్పు చేసెడివారె కన్నతల్లి
చరియించు భల్లూకసతులు పేరంటపు
ముత్తైదువలె నీకు భువనజనని
కనరాని యీముండ్లకంపల నీడలు
రమణీయనగరులే రామపత్ని
వెక్కసంబుగదోచు నక్కలకూతలు
పుణ్యాహఘోషమే భూమిపుత్రి
గీ. వేడికన్నీటముంచు నీ యేడ్పువినము
ఒప్పు సీమంతపుంసవనోత్సవంబె
మాత, యోత్రిభువనభూత, మహితజాత
నితరగుణజాత, యోసీత, పరమపూత.

అకటా! జననీ! పుట్టినది మొదలెన్నియో దుఃఖములను గాంచుచున్న
దానవుగాక యొక్కనాఁడైనను సుఖమనునది లేకపోయెగా?

సీ. పుట్టినదాదిగా పొరిదుఃఖములెగాక
యావంత సుఖమొందవైతివమ్మ
అత్తవారింటిలో నమర భోగములున్న
నడవిత్రోలుటె నీకు నాయెనమ్మ
రఘురామపత్నివై రహిసింటనొకనాఁడు
నలరనుండగ నేరవైతివమ్మ
శ్రీరాముతోఁగూడి గృహమున సుఖముల
ననుభవించగ నోచవైతివమ్మ
గీ. ఇంతి యడవిని నెట్లు చరింతువమ్మ
ఎంచి ప్రాణము లెట్లు భరింతువమ్మ
చేరి యక్కట విధియెంత చేసెనమ్మ
మరల నెప్పుడు మిమ్ముల మనుతునమ్మ.

ఓ భాగీరథీతీరంతరువులారా! ఓ శార్దూలభల్లూకాది వనమృగములారా! ఓ యరణ్యలతాకుంజములారా! మీరు నోచిన పుణ్యము నేను నోచనైతిగా? ఈలోకమాత ఈజగత్కల్పవల్లి, ఈ సాధ్వీమతల్లి సేవించి భక్తిచే నామె కాశ్రయమిచ్చి మీరెనలేని పుణ్యము గట్టుకొనుచున్నవారు, నాకట్టి భాగ్యము లేదయ్యెగా? అయ్యో! మా దేవదేవిని, మా జానకీదేవిని వలకప్పగించి పోవుచున్నాడ, మీరెట్లు కాపాడెదిరో? మీరెట్లు నాతల్లికిసూరట కలిగింతురో కదా? అకటా నాకు పోవుటకిష్టము. ఈ జానకికి గడపటి నమస్కారముచేసి పోయెదగా?

సీ. తొలిజామునను నేలేచి లలితభక్తిని జేసె

పరగ ప్రాతఃకాలవందనంబు

పనివేళ లక్ష్మణా! యసి పిల్చి సన్ముఖుడై

వాసి నేచేయు సద్వందనంబు

వనిలోన ఫలములు గొని తెచ్చి యర్పించి

వరదాస్యమున జేయు వందనంబు

సుమము లాజ్ఞయై మనుపుచోం బుత్రుని

భంగి నే సల్పెడు వందనంబు

గీ. ప్రణుతులు ... లు రాఘువపత్ని నీకు

అమితవందన ములు జగిపంబ నీకు

దివ్యసాష్టాంగనుతులు రామదేవి నీకు

పెక్కు మ్రొక్కులు భూదేవిబిడ్డ నీకు.

అయ్యో! ప్రాతఃసంధ్యాకాలములయందు త్రికాలాభివాదముల నేజేయు మా సీతామాత మందహాసభాసురముగు సంపూర్ణానుగ్రహమున దన కరాబ్జమును నాశిరముపై నిడి మంగళాశిషంబులు నిచ్చుట గాంచితిగాని యిట్లుఘోరతరశోకమున మూర్ఛిల్లియుండుటగాంచ నైతినిగా? ఓపాపహస్తములారా! ఇన్నిదినము లే తల్లిని పూజించు

చుంటిరో, వింజామరలనుబూని, పాదారవిందముల ధరించి, శ్వేత
ఛత్రములగ్రహించి యేలోకమాత ననవరతము భక్తి సేవించి ధన్యు
లగుచుంటిరో, అట్టి రామచంద్ర సామ్రాజ్య లక్ష్మిని మీరీనాడు భీకరార
ణ్యమున ద్రోలి భయంకర వన్యమృగముల పాలుజేసి పోవనుద్యమించి
తిరా? అక్కటకటా! సూర్యవంశక్షీరవారాశియందు నిరతకలుష
హాలాహలముబోలె నే నేల జన్మించితిని? శ్రీరామచంద్రుఁ డిప్పుడు
కలిగినకోపమున సీత నడవులఁబెట్టిరమ్మనఁగాఁ జేతులార విడచిన
వాఁడను నేనుగదా? నేనట్లు చేసిపోయిన వెంటనే నన్నెంతయో
నిర్దయాత్ముఁడని నిందింపఁడా? అమితక్రోధోద్భవోర్మి మాలికలం
మనోవారిధిని సంచరింప నల్లన్నమాత్రమున నిట్లుచేయ బాడియే
యని దూషింపఁడా? భరతశత్రుఘ్నులు కన్నతల్లిని కారడవుల
ద్రోలిన పాపాత్ముఁడని నాపాపపుమోము జూతురా? కౌశల్యాసుమి
త్రాదులు మాకోడలికి బడరానియిడుముల నొడఁగట్టిన కూళుఁడనే
యని నన్ను పరిపరి దూషింపరా? అయోధ్యాపుర జనులందఱు
నాబాలగోపాలము నన్ను తేరిచూడక తమకన్నీళ్ళచే నాకు శాపోదక
ములిచ్చుచు లోకనిందిత దుష్కర్ముఁడని దినదినము నాప్రాణము
లకై ప్రలాపించరా? జనకరాజేంద్రుఁడు వీఁడెట్టి పుణ్యహీనుఁడని
దూరీకరింపఁడా? అకటా! ఎందుకు గానివాఁడనైతిని? ఎంతయుపసం
దల పాలైతిని? ఎట్టిదుర్భర కలుషాత్ముండనైతిని? ఎట్టిపరహేయ
నరకపాత్రుఁడనైతిని. పుణ్యదూరుండనైతిని. రామునకుగానివాఁడ
నైతిని, బంధువులకు రోతగలిగించితిని, తల్లుల కెడమైతిని, తమ్ము
లకు దూరుఁడనైతిని. వేయేల! సర్వలోకములకు దూషణీయుఁడ
నైతిని. పాపపుమోము జూపక బరమనీచుఁడనై కలకాలము
దుఃఖమున నశించి నశించి యిహలోకమున బాయవలసివచ్చెఁగా?
అక్కటకటా! ఇపుడు కదలాడు పంచప్రాణములారా! నన్నేల
బాయకున్నారు? ఇపుడింత పరితపించుచున్న కటికమానసమా!
నీవేల పగిలిపోకున్నావు? సర్వపాప నిచయాలవాలమగు ఓదూష

ణీయులక్ష్మణ శరీరమా! నీవేల కుళ్ళి నీర్సై మంటఁగలియుచున్నావు! ఓజానకీదేవీ! నేఁడుమమ్ముల బాసితివా? అయోధ్యాపురభాగ్య లక్ష్మీ! మాకు దప్పితివా? సకలపుణ్యపరిశుద్ధజగన్మాతగో! నాతో నొక్కమాటాడవే. హా! భరింపజాల! అయోధ్యాపురమా! నిన్ను నేచూడజాల. జీవింపజాల. సకలాగ్నివిమపగ్వాత సర్వశార్దూల సమస్తాయుధములారా! నాపై యేల మీకు దయకలిగెను? దేవ వర్గములారా! పక్షిసముదయములారా! మానులారా! నక్షత్రము లారా! మీరు మా సీతాదేవిని రక్షింపుడు. పరేతలోకమున నున్న దశరథభూపాలచంద్రమా! నీకోడలిని నీకప్పగించి పోవు చున్నాడ, నీవేరక్షించుకొనుము. హా! సీతా! రామా! పరమ నిర్భాగ్యలక్ష్మణా! సీతా! (మూర్ఛిల్లును) (యవనిక పడును)

---

## తృతీయరంగము

### భాగీరథీతీరారణ్యము

[సీత పరుండియుండి లేచును]

సీత—(నలుదిక్కులఁజూచి) లక్ష్మణా! లక్ష్మణా! పోయితివా? పోయితివా? ఇక దిక్కులేనిదాననైతిని. ఎందఱు బంధువులు కలిగియుండియు తుదకు దిక్కులేని యడవిని చచ్చుటాయెగా? నీచములగునాప్రాణములనైన బాయుటకు లేదే? ఈపాడుగర్భము నా కెక్కడి శత్రువయ్యెను? లోకోపవాదమా! నీవు నా కెక్కడ దాపురమైతివి! రామా! రఘుకులధామా! నేడేల నాకు రాముడవు కాకపోయితివి? లంకలోనున్నపుడుకొంత కాలము నే కేతాళ లేనివాడ విపుడు మద్వియోగము నెట్లుకలకాలము భరింతువు? అలనాడనసూయ నీతోవచించిన యుపదేశమును మఱచితివిగా? నీయట్టి క్రూరమానసు లెందైన నుందురే? నిరపరాధిని నన్నింత బాధించెదవా? ఆబాధ నిన్ను బాధింపక మానునా? నీవుచేసిన

ఘోరకార్యము నిన్నెన్నఁడైన నపగనొందింపక మానునా ? నిన్ను
నమ్మినందులకు మంచి ప్రతిఫలమిచ్చితివి. నీవు చేసిన బాసలకు మంచి
ప్రయోజనము నొసంగితివి. రాముడు దయాళువు. రాముడు సద్గుణ
ధాముఁడనుటకు మంచియోగ్యతను గల్పించితివి నేను
చచ్చినపుడైన నీధర్మమును నాధర్మమును జగమెఱుఁగుఁ గాక.
నాశవమునుఁ జూచిన ప్రతిజంతువును నాసౌశీల్యమును పరీక్షిం
చునుగాక! నీవు వంచకుఁడవు. కఠినుఁడవు. పరుల మాటలను
నమ్మెడివాఁడవు నిన్ను బ్రహ్మ నాకొఱకై సృజించెఁగాబోలు.
నీవును, నీతమ్ములును, నీతల్లులును సుఖముగా నుండుఁడు. నాగతి
యెట్లయిన నేమి? నన్నింతగాసినొందఁజేసినందుకై సర్వశక్తి, సత్య
శక్తియైన నిన్ను దుఃఖమున ముంచదా ? (యోచించి) అకటా!
మారామచంద్రుని దూషించుచున్నదాననే ? మారాముఁడా
సూర్యవంశకలశవారాంబుధిసోముఁడా తారకనాముఁడా దూషిం
పఁదగినవాఁడు ? కాఁడు కాఁడు. కాకున్న దీనికేమనవలయు ?
అయ్యో! పురాకృతపాపఫల మనుభవింపక పోవునే? పరమశాంతశ్రీ
నిధియగు శ్రీరామచంద్రునంతటివానికి సైతము నాపైనిష్కరుణ
కలుగవలయునన్న నాదుర్విధి నేమందు అకటా! శరీరముతూలెడు
అంగములుకంప మొందెడిని ఇంద్రియములు నావశముకాకున్నవి.
అకటా! నిలువజాల తాళజాల, భరింపజాల, రామా! శ్రీరామా
ఏల కావింపవు ? రాజలలామా ! ఏలనన్నారడింపవు ! కోదండ
రామా! ఏల దూరము పోయెదవు ? తారకనామా ! నన్ను చేర
రావే ? వలదు వలదు, నాపైకోప మూనవలదు. నీవు కనిపింప
కున్న నీసీత ప్రాణముల భరింపగలుగునే? నీరజవిలాససుందర నేత్రా
రవిందమగు నీమోమందమ్ము నొక్కపరి నను దిలకింపనిమ్మా! నా
ప్రాణపంచకమును కానుకఁగొనసైన యొక్కపరి నీదర్శనభాగ్య

మొసంగుమా? అయ్యో! ఈనిర్భాగ్యురాలి కింకెక్కడి శ్రీరా
ముఁడు? ఇంకెక్కడి సంతోషము ?

ఓజనకా! న న్నేల యింతకాలము పరిపాలించితివి ? సకలసురాసుర
మానవవర్గహృదయ సంస్తవనీయలోక ప్రకాశితసత్యమా? నేఁడేల
నావంతఁ బాపవైతివి ? నిరతచరాచరజీవజంతుస్థాన విరాజమాన
పరబ్రహ్మచైతన్యమా ? నేఁ డేల ధర్మాధర్మముల వేరుపఱుప
వైతివి? బ్రహ్మాండకల్పనాధురీణచతుర్ముఖుఁడా ! న న్నేల లోక
భారముగ సృజించితివి? ఓభూసతీరత్నమా? సప్తకులాచలసముద్ర
పరిభాసురవైన నీవు న న్నేలగంటివి! నాదుఃఖమునుచూచి యేల
యుపేక్షించియున్నదానవు! నే నిక్కంపు పతివ్రతనగుదునేని, మా
రాముఁడు సత్యప్రతిజ్ఞుఁడగునేని భూదేవీ! కొనిపొమ్ము నన్ను నీ—
(లోపలనుండి తాళుము తాళుము)

[ప్రవేశము శీఘ్రయానమున వాల్మీకి]

వాల్మీ—జానకీదేవీ! తాళుము, తాళుము.

ఉ. తాళుము తాళుమమ్మ మ్మఱిదాల్పగ నేటికిచాలునమ్మ మ
మ్మేల తెగించి నీవు ఇటు లేటికి శోకము గ్రైనమ్మ యో
బాలరో! ఆత్మహత్య గడుపాపము దెచ్చు గదమ్మ జానకీ
చాలును సాహసంబిక విచారము మానగదమ్మ యమ్మరో.

తల్లీ! ఎంతటి సాహసకృత్యమున కుద్యమించితివి ? ఈ కానల కేల
చనుదెంచితివి ?

సీత—మానిచంద్రమా ! ఆ యుదంతము నే నచింపజాల.

వాల్మీ—అమ్మరో ! నీవు చెప్పకపోయినను నాజ్ఞానదృష్టిచే నేనం
తయు నెఱుంగుదును. అపవాదభయమున నీ నాథుఁడు రామచం
ద్రుఁడు నిన్నడవులకు నంపెగా ? నిన్నపరాధినిగా నెంచెనా ?
ఎక్కటా ! యేమి కాలముహిమ !

సీ. బ్రహ్మాదులనుగన్న మాతవౌ నీవైన
నేమూర్ఖ జననింద నెన్నిరమ్మ
ఎన్ని న నేమాయె నినకులేశుఁడు దాని
నెన్నఁడి నెట్టుల నమ్మెనమ్మ
నమ్మెఁబో నదిగాక నమ్మిపోఁజగ నిన్ను
తల్లిరో యెటుబాయ నలచెనమ్మ
తలఁచెఁబో నదిచూడ దగ్గరంబుకాదన
కడవుల నెటు నిన్ను విడచెనమ్మ

గీ. నారి మాపురఁ బెద్దలు లేరటమ్మ
అరయ మీయత్త కౌసల్యయైనఁ దనకు
బుద్ధియేటికి చెప్పకఁ బోయెనమ్మ
ఇంక మాయమ్మ యది నూరడిల్లునమ్మ.

(అనుబంధము 15)

దేవీ! నీవు పరాశక్తివి కావా? సంకల్పమాత్రమున సర్వమును చేయగలవు. సర్వమును నాశన మొనర్పగలవు. సీతారాములుగా నుద్భవము జెందిన లక్ష్మీనారాయణులగు మీకు వియోగము ఘటిల్లుట మాబోటివారికి నీదర్శనమబ్బుఫలము కలిగియుండుట చేత నేకదా? తల్లిరో ! ఇచ్చటనే నా యాశ్రమమున్నది. కొంతకాలమిందు మీ నివాసభాగ్యము నాకొసంగుము నన్ను కృతార్థుని జేయుము.

సీత—వాల్మీకిఋషిచంద్రమా! నదీప్రవాహమున బోవువారికి తెప్ప దొరకినట్లపారదుఃఖప్రవాహముల పడిపోవు నాకు నీయనుగ్రహమను నౌక తెప్ప దొరకెను. అవశ్యము మీపుణ్యాశ్రమమున మీయానతియగువఱకు వసించి నాశరీరమును బవిత్రము చేసికొనియెద. అయిన—

వాల్మీ—జననీ! సంశయింపకుము. కాలమొక్కరీతి నుండదు. నీకై మరల శుభకాల మెదురుచూచుచున్నది; నిమ్ము నేనంతయు వచించెద.

సీత—భాగ్యము. (నిష్క్రమింతురు)

---

## చతుర్థరంగము

### వాల్మీకాశ్రమమున నొకకుటీరము

[ప్రవేశము : సీత]

(అనుబంధము 16)

సీత—ఆహా! ఇక్కడికి దాదాపున మూడు సంవత్సరము లయినది నా మనోనాథుని యుదంతము తెలియక. నాకీజన్మమున శ్రీరామ చంద్రుని ముఖము దిలకించుభాగ్యము కలదో లేదో తెలియదు. ఈవాల్మీకిమునిచంద్రునియాశ్రమమున నాకేకొఱంత లేక యుండి నను నానాథుని విడనాడిన లోకమే నాకు పాడై తోచుచున్నది గదా! ఆమునిమందారుడు 'అమ్మా! నీనాథుడు రామభద్రుడు క్షేమముగా నయోధ్యయందున్నాడని నన్ను పరిపరి నూరడించు చుండును. నాకు జనించిన 'లవకుశు' లను కుమారులను కడు గారాబమున బెంచుచున్నవాడు. వారికి వివిధ విద్యాసారము బోధించుచున్నవాడు. ఆహా! ఈకుమారుల గాంచిన మనసున నున్న దుఃఖమంతయు మాసి వారి ముచ్చటల నాలించుటవలన లోకమునే మఱచుచున్నదానను. వారుకొంచెము కనుమరుగైన యెప్పటి శ్రీరామవియోగమువలన గలిగిన దుఃఖమే నేనున్నా నని పైనజేరి నను బాధించుచున్నది గదా?

(లోపలధ్వని—17 వ అనుబంధములోని పల్లవి)

అల్లదే! నాకుమారులు లవకుసులు వచ్చుచున్నట్లున్నది.

[ ప్రవేశము: [illegible] ]

([illegible] 17)

సీత—([illegible]) నాయనా! ఇంతసేపెక్కడికిపోయి యుంటిరి?

లవ—ఎక్కడికి పోదుమమ్మా! మా తాతగారగు వాల్మీకులవారొకు పాఠములు చెప్పుచుండిరి. అవియన్నియు నేర్చుకొని వచ్చునప్పటి కింతిసేపయినది,

సీత—నాయనా! మీ తాతగారు వాల్మీకులాశ్రమముననేయున్నారా?

కుశ—లేదమ్మా! వారు మనకొరకే ఇప్పుడే యాశ్రమమునకువచ్చిరి.

సీత—అయినను మీరింతవరకు వారివద్ద పాఠములు నేర్చుకొనుచుంటి మని చెప్పితిరే! అది యసత్యముగాదా?

లవ—అసత్యమేలనమ్మా? వారు ఉదయమే వచ్చియే యుండిరి; మేము పాఠములు నేర్చుకొనుచునే యుంటిమి;

సీత—'వారివద్ద' అని చెప్పితిరే!

కుశ—వారియాశ్రమమున నుండుట వారివద్ద కాదా?

సీత—కుమారులారా! ఎన్నివిన్యాసములను నేర్చితివిరా ?

కుశ—అమ్మా! మన మింకనెన్ని నేర్చుకొనవలయును?

సీత—నాయనా! మీరు విద్యాబుద్ధుల నేర్చుకొని యొద్దైన నుద్యోగము సంపాదించిన మనము పట్టణము జేరుదమట లెమ్ము.

లవ—తల్లీ! విద్యాబుద్ధుల నేర్చుట యుద్యోగమునకేనా! ఆ యుద్యోగము మిక్కిలి పరతంత్రముగాదా?

కుశ—అట్టిపరతంత్రుడగు వాడేమి లోకోపకారములు జేయును ?

గీ. అవని తనదేశ సోదరులకు సాయమొసగుచు
నెసగు పరతంత్రతను ద్రోయ నగునమ్మ
విద్య కుద్యోగమె ఫలంబెమి గానమ్మ
అపుడు మనదేశ మభివృద్ధి నందునమ్మ.

సీత—(స్వగతము) ఆహా! ఏమి యీ పసికూనల మనోదార్ఢ్యము ? (ప్రకాశము) నాయనా! మంచిగుణము ఇట్టి గుణములే బాలుర కుండదగినవి. ఇవి యెచ్చటనుండి పట్టుబడియె?

కుశ—జననీ! మొన్న మాగురువులు మాతో రామాయణకథను బాడించుచు దానియర్థమును జెప్పిరి. అందులో యెవడో రాము డట! ఎంతగుణవంతుడు! ఎంతసత్యవంతుడు!

లవ—ఆయన దేవుడని మనగురువు చెప్పలేదా?

సీత—(కన్నీరునించును)

కుశ, లవ—అమ్మా యేల ముఖము వంచుకొంటివి?

(అనుబంధము 18)

సీత—ఏమియు లేదు నాయనా! ఊరక కండ్లు మండుచున్నందున కన్నీరు వచ్చినది.

కుశ—చూడుమమ్మా! వీడు మొన్నచిన్న యేనుగుపిల్లను బట్టి యెంతో భాధించుచుండ నేనెంత వలదనినను విన లేదు.

సీత—(లవునితో) ఏమినాయనా? నిజమా? అట్లు చేయరాదు. ఒక రిని భాధింపరాదు.

లవ—అమ్మా! మాయన్న మిక్కిలి పిఱికివాడు. నే నా యేనుగు నెక్కి కొన్ని దుష్టమృగములజంపితిని. వీడు 'వలదు; వలదు' అని చెప్పుచుండును. ఇట్టి పిఱికివారున్న దేశమున కేమిప్రయోజ నము? ధైర్యమును దేశబలమును గలిగి, బుద్ధిబలము నుపయోగ పరచి, మనము పుట్టిన దేశమునకును, మన ప్రభువునకును సహా యము జేయవలయునుగదా ? అట్టివారుగా కెవరో పనికిమాలిన వారు పుట్టుట తల్లుల కడుపుచేటుకదా?

(అనుబంధము 19)

సీత—లవకుమారా! నీగుణమును నీధైర్యమును, మెచ్చతగినవే కాని దుడుకుతనము మాత్రమువలదు.

[ప్రవేశము : ఒక మునిబాలకుఁడు]

ము — బా — అమ్మా! మా గురువులు వాల్మీకులు వచ్చుచున్నారు.

సీత — నాయనగారు వచ్చుచున్నారా? మంచిది.

ము — బా — (నిష్క్రమించును.)

[ప్రవేశము : వాల్మీకి]

(సీతయు లవకుశులును నమస్కరింతురు)

వాల్మీకి — అమ్మాయీ! క్షేమముగ నున్నదానవా? మునికామినులు నీకుఁ జక్కగ పరిచర్యఁ జేయుచున్నారా? బీదవానియింటికి రమాదేవి వచ్చిన ట్లీమునికుటీరమునకు నీవు చనుదెంచితివి. తనయా! లోక జననివైన నీకు మా యాశ్రమ వృక్షములనీడ నివసించుట యెంతయు కష్టతరముగా నుండునేమో కదా! తల్లీ! నీవీ మునిపల్లె నుండుటచేత నిచ్చటివారందఱు నిదియే విష్ణులోకమని భావించుచున్నవారు. ఏదో యొక కారణమున నీకు మాపైఁ గల యనుగ్రహ భాగ్యము కలిమి కలుములదేవివైన నీ విచ్చటికి వచ్చితివి గాని లేకున్న మాబోఁటివారికి నీ దర్శనమబ్బునా? మా యాశ్రమమున నీ వెన్నియో కష్టముల నొంది యుందువు, అయినను చింతిల్లకుము. కొలదికాలములోననే నీదుఃఖమున కంత్యము రాఁగలదు. నేను బ్రహ్మలోకమునకు సర్వతోముఖ మహాయజ్ఞమును చూడబోవలయు. మఱల శీఘ్రకాలములోననే వత్తును. అంతవఱకును నీ వాశ్రమమునందు ప్రతిదినవర్తిష్యమాణ ధర్మకార్యముల నెల్లను నాయానతిచే నిర్వర్తించుచుండవలయును. అతిథిపూజల యందు, అభ్యాగతుల నారాధించుట యందును, మునిభార్యలను జక్కని నేమనం బొనర్చుచుండుము.

సీత — జనకా! అవశ్యము తమ యానతిమేఱకు నిర్వర్తించెద. నీ దయావలోకమున నేగదా నే నెంత దుస్తరదుఃఖముల పాలైనను

జీవించియుందునటు? [illegible] నేని [illegible]

త్సముద్రము [illegible] ! [illegible] జ్ఞానో[illegible] దేశ

మప్పుడప్పుడు [illegible] త్తాత్పర్యా

నగుచుంటిని. మఱల [illegible] దినముల

లెక్కించుచుందును.

వాల్మీకి — జననీ! శీఘ్రకాలములోనే [illegible] గాక!

నే నుపదేశించిన ధర్మోపదేశములు [illegible] రామాయణకథ నప్పు

డప్పుడు మీ తల్లియొద్ద [illegible] నాశ్రమమున

కే యుపద్రవమును [illegible] నే పోయి

వచ్చెద, భద్రము. (నిష్క్రమించును)

సీత — కుమారులారా! ఏదీ రామాయణకథ మీ తాతగారు ఉపదేశిం

చితి మంటిరే కొంచెము పాడుడు చూతము

(అనుబంధము 30)

సీత — (కన్నీరునించును.)

లవ — అమ్మా! అమ్మా! ఏమట్లున్నావు? ఈ కథ నీకు బాగుగ లేదా?

ఏల కన్నీరు నించెదవు!

సీత — ఏమియు లేదు నాయనా!

లవ — అమ్మా! మాగురువులు చెప్పిన రామాయణమునలో 'సీతాదేవి'

యనియున్నదే; ఆమెపేరే నీపేరు పెట్టియున్నారు చూడమ్మా!

సీత — ఔను నాయనా! ఆమెయు నావలెనే యొక నిర్భాగ్యురాలు.

కుశ — అదేమమ్మా అట్లనెదవు? ఆసీతాదేవి కావలసిన నిర్భాగ్యురాలు

కానిమ్మా. నీవేల య్యెదవు? నీ కుమారులము మేము లేమా?

ఈమూడులోకముల నొక్కనిమిషములో జయించి, నీయనుగ్రహ

మొక్కటియున్న, నిన్ను చక్రవర్తినిగా జేయమా? ఇంకొక్కమారి

యిట్టిమాట లాడకుము. అమ్మా! మఱచితి, ఆకథలో రాముడట!

నుండరాదని తలచి నట్టడవిని ఘోరమృగములవాత వైచితిని గదా ! నీపాలిటి పాపదేవతనై నీవెంటనంటి నిన్ను హింసించుటకు బ్రహ్మనన్ను సృజించియున్నాడు. అయ్యో ! దుర్గంధకూపముబోలె, శూలభూమివోలె! నరకలోకముబోలెనన్ను యీపురినెట్లు చరించి జీవించి, ప్రాణముల భరియించువాడ ?

సీ. నిండుగర్భిణి కాన మండునగ్నిలోఁ ద్రోసి
యేమని జగతి చరించువాడ !
అబలయే సాధ్వియేయనక నమ్మినభామ
నడుకానవైచి యెట్లుడరువాఁడ !
భోగంబు, భాగ్యంబుఁ భూమిని, దేశంబు
కోశంబు నింకెందుఁ గూర్చువాఁడ !
తపియించి కృశియించి ఖేదంపువిషమునన్
దహియింప యింకెట్లు తాళువాఁడ !

గీ. అంతట నాభాగ్యఫలరాసి నటవిఁద్రోలి
నరకకూపముఁబోలు నీధరణి కెట్లు
కాంచువాఁడ ప్రబోధంబు కాంచువాఁడ
ఎట్లు లసువు మేన భరించువాఁడ.

లక్ష్మణా ! అయిన సీత జీవించియున్నదని నీకు నమ్మకముగలుగదా.

లక్ష్మణ—దేవా! గర్భభారమున నలసములై, భవద్వియోగ గర్భభారమున నత్యలసములై ; అపనిందాజనితశోకగర్భభారమున నత్యలసతరములై, నీయట్టి విజ్ఞానశిఖామణి నైతము తన్ను సందేహించెనుగదా యనుతాపము నత్యలసతమములై యున్న శరీర, ప్రాణమానస జీవము లాతల్లికి తెలియక మితిమీరి యెందేగునో తెలియకుండబోలును. అయ్యో! నీవలనగదా యింత యనర్థముగలిగె ? రఘుకులముపాలిటి యదృష్టదేవతయే యీనాటికి మముబాసెగదా? ఆతురతభావమున యుక్తాయుక్తముల విచారింపవైతివి. ఈ

సమస్తకార్యముల భారమంతయు మూటగట్టి నాతలపై బెట్టితివి. ఇపుడు పగచిన ప్రయోజనమేమి? అయ్యో! ఆ దేవి బాష్పజల పూరితనయనము లింకను శూలములై బాధించుచునే యున్నవి.

సీ. అనురాగపూరంబు నలరించె నేకనుల్
దశరథకోడలై తనరునాడు
భయభక్తిరసముల పరగించె నేకనుల్
పురిబాసి యడవికి బోవునాడు
ప్రళయాగ్నికీలలై రావణుదహియించె
నేకనుల్ లంకకు నేగునాడు
కరుణాసుధావృష్టి కపివలిసుతు నించె
నేకనుల్ ముద్రికనిచ్చునాడు

గీ. కుళలమిపుడు నేకనుల్ విభుం గూడునాడు
అట్టి కన్నులు బాష్పధారాళి మునిగి
నిఖిలలోకంబులడర మున్నీటముంచె
నినకులేశ్వర! యేమందు విధికృతంబు

శ్రీరామ—లక్ష్మణా! నీ వెంతదూరినను తక్కువయే యగు సుమా! విధియే! లోకాపవాదమున బడుటకంటె మృతియే మేలని వెను దీయక నా ప్రాణలక్ష్మిని, నా యర్ధాంగ లక్ష్మిని విడచితిగాక యూరక పరిహాసమునకు విడచితినా?

శత్రు—అన్నా! అట్టి యపనిందకోడికై యట్టిఘోర కార్యము జేయ వలయునా? ఈకార్య మాచరించినమాత్ర మిదియొక యపనింద కాదా? అంత విధిలేకున్న వేరుభవనమున నామెనుంచి ప్రస వించిన వెనుక బంధుల యింటికి బంపియుండరాదా? ఏల యిట్టి యవాచ్య, పుత్రవంశఘాతుక, క్రూరకార్యమునకొడిగట్టవలయు!

శ్రీరాము—శత్రుఘ్నా! నే నంత యవిచారమున నీ కార్య మొనర్చితి ననుకొంటివా! ఈగ్రామమున సీత యున్నంతకాలము, జనులు

ఫలరాశిన్యాయముగ నాశనమొందుననిన నాకెన్నటికిని దోపదు, అట్లు కాకున్న నేడు లోకమున ధర్మదేవతయే నశించె నను కొనుడు. సూర్యోదయ సూర్యాస్తమయములే కలుగ వను కొనుడు. ఇంక నన్నీవిషయమున బ్రశ్నింపకుడు.

లక్ష్మణ—దేవా! లోకారాధ్యుడవైన నీయాశయము మేము తెలియజాలుదుమే? నేననినట్లులనే సర్వశుభములు కలుగుగాక! మాజానకీదేవి సుఖప్రసూతయైపుత్రునుగాంచుగాత! ఇప్పుడైన లోకాపవాదము తొలగినదిగదా? పౌరులందఱునాచాకలివానిని వెదకినంగాని వాడు దొరకడయ్యె. వానిపేరును, నూరును మన యూర లేవట. వాడెక్కడనుంచివచ్చెనో, యెక్కడికి బోయెనో యద్భుతముగా నున్నది. మాకు వచించిన భద్రుడు సైతము నాటి నుండి మనకు గనుపింపడయ్యె. ఇదియంతయు వాని మాయయే యని పౌరులందఱు వానికై వెదకుచున్నారు నీయిష్టార్థసిద్ధియయ్యెగదా? ఇంకనైన వెదకించి పిలిపింపుమా మాసీతాజననిని.

శ్రీరామ—కానిమ్ము! ఇంకను కొంత కాల మేగవలయు.

లక్ష్మణ—ఇంక తమకు యజ్ఞదీక్ష ప్రారంభమగును మొన్న వసిష్ఠ లశ్వమేధయజ్ఞమును చేయుమని మీకానతివ్వలేదా?

శ్రీరామ—లక్ష్మణా! నిజము. ఆరావణసంహారజనిత బ్రహ్మహత్యా దోషములు బాపికొనుటకై యశ్వమేధము చేయవలసివచ్చినది. రేపు బృహస్పతివారమే దీక్షాబద్ధుడ కావలయు. అశ్వము వెంట మనశత్రుఘ్నుడే యరుగవలయును. మఱచితిని; మీరు భరతునితో వచింపుడు యజ్ఞమునకు దగు సన్నాహముల జేయుమని, ఇక మీరు పొండు.

లక్ష్మణ, శత్రుఘ్న—భాగ్యము. (నిష్క్రమింతురు)

శ్రీరామ—అకటా! నే నెట్టి కఠిన కార్యమును జేసితిని? నట్టడవుల పాలుచేయుకాలమున, నాయబల, యాశిరీషకోమలాంగి, యా

యింద్రజిత్తుతో యుద్ధము చేయుచు నతని నోడింపలేక 'ధర్మాత్మా! సత్యసంధశ్చ రామో దాశరథిర్యది' అని 'రాముడు సత్యసంధుడగునేని, ధర్మాత్ముడగునేని, యీ బాణ మింద్రజిత్తునుజంపుగాక' అని చెప్పితివే యదియే చాలును నీశూరత్వమును చాటించుటకు.

లక్ష్మ—మునికుమారులారా! మీరు బాలకులనియు, బ్రాహ్మణులనియు దాళితి, ఇక తులువమాటలు మానక యుద్ధభూమినుండి తొలగెదరా లేక నాబాణవృష్టికి మీజీవితాగ్ని నప్పగించెదరా ?

లవ—సహోదరా ! ఇతనితో పరిహాసములు చాలును, ఇతనిగోడు వినజాలము. ఏమయ్యా ! మేము యుద్ధమునుండి తొలంగవలయునన్న శత్రుస్తోమముల నీలోకమునుండి తొలగించిన తర్వాతనే తెలిసితివా ? (అనుబంధము 30)

లక్ష్మ—అయ్యా ! కాండాసనవిముక్త చండతరవిశిఖ ప్రవాహముల గాని యాశ్రమవృక్షమునందలి లేజిగురుటాకులు కావు కరవాల ఖడ్గ క్షతక్షుభితరక్త మాంసాంచిత రణరంగము గాని సమారాధన భోజనాంగణము కాదు ! కాండాసనకాండ సముదయములు గాక మాపునమోయు దర్భసమిధలుగావు. బాపలు మీకేల యుద్ధము మాపురికిరండు వస్త్రమాల్య భూషణాదుల నిచ్చెదము.

(అనుబంధము 31)

కుశ—ధరణీశా! ఏండ్లు మితిమీరి వచ్చినవి కాని బుద్ధి నీకు రాదయ్యె తెలివియొకరిసొమ్మేమయ్యా? వీరక్షత్రియవంశ దీపకులమగు మాకు సమరభూమియేకదా మోక్షస్థానము ? ఇంత తెలియవైతివికదా ?

సీ. చెలువారుపర్ణశాలలు లేక యున్నవే
మీ రిచ్చుబంగారు మేడ లేల
రుద్రాక్షమాలికల్ రూఢిలేకున్నవే
సొగసైన రత్నాల సొమ్ము లేల

నలువారు కృష్ణాజినములు లేకున్న వే
పట్టెమంచముతోడి పరుపు లేల
కందమూలంబులు కలుగవే మాకెందు
భక్షించుటకు పిండివంట లేల

గీ. ఆదరంబగు వీబూది లేదె మాకు
పూలుపునించెడు శ్రీగంధపూత లేల
దాసజను లేల జలతారుతాల్పులేల
యుద్ధరంగమె మోక్షంబు యోధవర్య

అనుబంధము 32

లక్ష్మ—మీరు క్షత్రియకుమారులా! మిమ్ము గన్న భాగ్యము గల తల్లిదండ్రు లెవరు?

(అనుబంధము 33)

లవ—అది నీకేలనయ్యా? ఏమి! వంశావళి వ్రాసెదవా? చేతనైన యుద్ధముల కాగతోస్మి యనుము. లేకున్న జితోస్మియనుము.

(అనుబంధము 34)

లక్ష్మ—బాపలారా? లేవెన్నలల సోకిన లోవన్నె తరుగు మీసుకుమారము లగునునుదొడల కరవాల మిడుట పూలరాసి యందగ్ని విడుట యేకదా? చెలువారు కమలనాళము బోలు మీ కంఠసీమ నర్ధచంద్రసాయకముల ప్రయోగించుట మాలతీలతానిచయము లవిత్రమున దరుగుట యేకదా? ఏల మూర్ఖత బట్టెదరు?

కుశ—అయ్యా! నీవు క్షత్రియుడవయ్యు క్షత్రియధర్మమును దెలియక మాట్లాడుచున్నావు. యుద్ధరంగమేకదా క్షత్రియులకు స్వర్గద్వారము? శౌర్యమేకదా రాజులకు బరమధర్మము! అట్టి స్వధర్మమునువదలి పరమధర్మము నాశ్రయించుట నరకద్వారమే కదా? వేయేల? ఈయశ్వము నీశౌర్యమును మాకప్పగించిన బోదుమే గాని పనికిమాలినమాటల నాడిన దొరకనేరదు.

లక్ష్మ—వెఱ్ఱిశిశువులారా! క్షత్రియులై సమరాంగణముననే తారతమ్యమును విచారింపవలదా? వీరశూర కౌసల్యానందను లెక్కడ? పసికూనలగు మీ రెక్కడ?

లవ-మీతల్లియే వీరశూరకౌశల్యయైన మాతల్లి వీరాధివీరశూరయనుకొనుము. ఊరక వదరిన ప్రయోజనమేమి? శక్తియున్న గూయక చూపుము.

లక్ష్మణ— ఔరా! నేను పసిపాపలని కరుణించి యుద్ధము వలదని బోధించుచున్నంతయు దిరిపెంపుతిండి తలకెక్కి మారులాడెదరా? ఇక మీశరీరంబుల మాలికలుగా వైచి మాతురంగము గొనియెద.

(అనుబంధము ౩౫)

కుశ—ఈగ్రుడ్డిబెదిరింపుల నెవ్వరిని బెదిరింపజూచెదవు? కైకొమ్ము. గోదండమును. కైకొమ్ము బాణతూణీరములను. నిన్ను యముని యింటి కతిథిగాబంపెదను. (అని యుద్ధమాడుదురు. కుశుడు లక్ష్మణుని బాణముల నెగురగొట్టి ధనస్సును విరచును)

లక్ష్మణ—(స్వగతము) ఔరా! మోములుచక్కదనము చంద్రబింబమునుమీర నస్త్రవిద్య శ్రీరామచంద్రుని మీరుచున్నదిగా?(ప్రకాశము) బాలకులారా! మీవీరత్వమును మెచ్చితి. మీరువీరవర్గశిరోమణులగుదురు. మీకు వలయు బహుమతులిప్పించెదను. తుదకర్ధరాజ్యమైనను యిప్పించెదను అయోధ్యకు బోదము. రండు. ఇక నాప్రతాపాగ్నికి మిడుతలుగా నయ్యెదరు. అప్పుడు మీతల్లి మీబోటి పుత్రరత్నముల బోగొట్టుకొని దుఃఖపుచావు జచ్చును.

లవ—ఏమయ్యా! మరల నీపిచ్చిమాటల మానకపోతివే? మాతల్లి రణరంగమున శత్రుస్తోమంబుల దునుమాడి వీరస్వర్గమందినదియే పురుషార్థమని భావించునుగాని గ్రద్ద బ్రతికినట్లు బ్రతికి తనవంశమునకును దేశమునకును, తల్లిదండ్రులకును, గొంచమైన నుపకారము జేయక యున్న పుత్రులను గాంచుట మేలని తలపదు.

ఉ. సాగమహాస్త్రవిద్య భుజసారము మీరఁగ శత్రుసంతతి సం
హారముఁజేసి శూరవరు లాసన రక్తజలప్రపూర మా
వీరవసుంధరాంగనకు నభిషేకముఁ జేసినఁ దల్లి మెచ్చుగా
కారయ మూఢపేరులను పందలఁ గాంచి మెచ్చునే.

కుశ—నీ రాజ్యము, నీ ద్రవ్యము, మాకేమియవలదు. కావలసిన మమ్ము దానముగాఁ గొనుము. నేమే నీకిచ్చెదము.

లక్ష్మ— (అనుబంధము 36)

అయిన నామాట్లు వినవా లేను. (అని దివ్యబాణము వేయు కుశుఁడు మూర్ఛపోవును. లక్ష్మణుని చెవిని సమీపించి) అయ్యో నేనెంతవల దసినను మూఁడవైనది తప్పఁగదా? వ్యర్థముగా ప్రాణముల బాసితివే? నిన్ను జంపి నేనెట్లు వెడలిపోవుదును?

కుశ—నేనును నిన్ను వదలి యెట్లుపోవుదును? రమ్ము (అని లేచి బాణములతీసి) ఓ బాణమా! మాతల్లి సుశీలయైన, మా గురువు తపోవంతుడైన నీవీక్షణమే నాశత్రువును బరిమార్పుము.

(అనుబంధము 37)

(బాణము వేయును లక్ష్మణుడు మూర్ఛిల్లును)

[ప్రవేశము : మునిబాలకులు]

లవ—అన్నా! మనగురువు మహిమవల్లను, మనతల్లి మహిమవల నను నీమహావీరుడు పడియెగాక, ఇతడు పరాక్రమధుర్యుడని తోచుచున్నది.

కుశ—సందేహమేమి? ఇత డత్యద్భుత పరాక్రమ వంతుడని మన వాల్మీకి ఋషిపుంగవుడు చెప్పుచుండలేదా?

అందఱు—భళి! భళి! మిక్కిలి సంతోషమయ్యె! మే మేమైన సహాయము చేయనలయునా?

లవ—(స్వగతము) ఇట్లుండవలయును. ఇపుడు లోకమంతయునిట్లే యు న్నది. జయించినవానివంకనే యందరును జేరుదురు (ప్రకాశము)

ఏమియు పలుకదు, ఊరకున్న బాలును పిచుండి! నీవుపోయి నీ తల్లితో మేమే జయించితిమని తెలుపుము. మేము మరల నెవ్వరైనవత్తురేమోకాచికొనుండెదము పొమ్ము. మరల శ్రీఘ్రముగరమ్ము) పిచండి—కానిమ్ము. (నిష్క్రమింతురు)

(యవనికపడును)

---

## ద్వితీయరంగము

స్థలము : హిమవత్పర్వతప్రాంతారణ్యము

ఆంజ—ఆహా! హిమవత్పర్వతమున నివసించు మహర్షులవలన నేడెట్టి సంతాపకరవార్త వింటిని! అఖిలలోకమాతయగు మాజానకీమాతను రామచంద్రుడు ఘోరారణ్యములకు బంపియున్నాడట, స్వభావమూఢులై, యసూయ పిశాచావేశితులై, పరదూషణారోపణ మాత్రప్రవీణులై ఘోరతరసంతాపసత్కీర్తిహారులై యున్న దురాత్ముల దుష్టాలాపనిందావాక్యముల మారామభద్రుడు మాదేవదేవుడు నమ్మి, యీయవాచ్య, క్రూరహింసాకార్య మొనర్చెగదా ? ఆసీతారాముల శ్రేయస్కరనిత్యాశీర్వచనములకై కొని యచిరకాలముక్రింద నేకదా నేనీతపోవనభూమి జేరితి! ఔరా! ఈయపవాదము సహజసాధువులగు సాకేతపౌరులది కాదట నాడుదండకాట విని రామలక్ష్మణులచే భిన్ననాసాకర్ణపుటయై, లంకాపుర రాజ్యలక్ష్మివినాశకారణభూతయైన శూర్పణఖయె, రావణాదిదనుజపరిపందిస్తోమంబులు బరిమార్పబడగా హతశేషుడై యెందో తప్పించుకొని బ్రతికియున్న యాకరాళుడును బన్నిన మాయోపాయ విజృంభణమట! కట్టా! కరుణారసమహిమాంచితములై కమనీయ కమలినీవేదశిరోవిలసితములై, ఘనతర సనకసనందన హృదయారవిందవిలసితములై యున్న యాజానకీపురంధ్రీమణీ రారంజిత నేత్రభాజీవంబులు నీరుక్రమ్మి, శోకరసమున ఖాడిమ్మెంత కాంతి బాసియు

యున్నవో కదా? శ్రీరామచంద్రుఁ సర్వాంగలక్ష్మియై ముక్తికాంతా మనోహరమూర్తియై, భక్తులపాలిటి కల్పవృక్షకీర్తియై, దివ్యజ్ఞాన సద్గుణస్ఫూర్తియై, లోకులందరకానానన, సకలగీర్వాణ బృంద మచ్చెరువంద విలసిల్లు పాతివ్రత్యమహిమంబున నెంతయు వాసి గాంచియున్న మాజానకీజనని యిట్టితలపరాని యపనిందపాలై పరితపించి పరితపించి యెనలేని కడకండ్ల ననుభవించెనన్న నిక పామర భూయిష్టమగు నీ ప్రపంచపువారిగతి యేమనవలయు? ఆహా! ఇంత దురంతములగు వంతలకు గారణ మారాక్షసపందలే కదా? వారిని నేను మనసిత్తునా! మదీయ వాలాగ్రంబున నా శూర్పణఖా కరాళుల కంఠనాళంబుల బిగియించి, పాదాహతివలచి దురంత పటుతరమదీయముష్టిఘాతంబుల మెదిపి, ముద్దజేసి శ్రీరామచంద్ర పాదకమలంబుల కర్పించెద. ఇదే పోయెద.

సీ. కనువారి కనువారి కలిగింప నలగింప
యపనింద వినియెంత నడలెనొక్కొ
భూధరావళిస్రుక్కి భూధరావళిదక్కి
భూపుత్రిమదియెంత పొగలెనొక్కొ
రామసింహములొంది రామసింహము డింది
యకట మారుతి! యంచు నరచెనొక్కొ
పరువార తరువాత పరివారముల జెంది
తనతల్లిదండ్రుల దలచెనొక్కొ
గీ. రాలవ్రాలుచు జాలి తా సోలెనొక్కొ
పరగభూదారములు జేరి భావమందు
తనదుభూదారు నెమ్మదిగనియెనొక్కొ
మాదుజనయిత్రి భూమిపై మనియెనొక్కొ.

(అనుబంధము 38) (పాడుచు నిష్క్రమించును)

(యవనిక నెత్తగా నదేయరణ్యము మఱియొకభాగము కనుపించుచున్న

[ప్రవేశము : ఆంజనేయుడు పాడుచు]

(అనుబంధము 39)

ఆంజ—అయ్యో! నే నెందెందు వెదకినను మాసీతామాతగానితుదకా శూర్పణఖాకరాళులుగాని దొరకరైరి. వెదకి వెదకి వేసరితిని. (అని కొంత విశ్రమించి మరల పోవుచుండగా)

(అని చెట్టుమరుగునుండి ఫలము భక్షించుచుండును)

[ప్రవేశము శూర్పణఖాకరాళులు]

శూర్ప—భళి! కరాళా! నీవు కరాళుడవే సరి. భద్రుడను పేరు పెట్టుకొని రాముని సేవించి సీతకును రామునకును నెడబాటు కలిగించితివి. ఇక రాముడు 'సీతా! సీతా!' యని మొరయెత్తి యేడ్చుచు నింకొకక్షణమునకో రెండు క్షణములకో ప్రాణముల విడుచును. రావణుడు, కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు చేయజాలక పోయినపనిని నీ వవలీల సాధించితివి. ఇపుడు నామదినున్న దుఃఖ మంతయు దీరె.

కరా—శూర్పణఖా! నీవుచేసిన కార్యము మాత్రము సాధారణమా? చాకలివానివేషము వేసికొని యెంత బాగుగ నటించితివి? రాముడు కాని లక్ష్మణుడుకాని ఏ ఒక్కరుకాని నిన్ను గుర్తింపరైరికదా?

శూర్ప—అంత వివాదమేల? నీవు కొంత పనిని, నేను కొంతపనిని సాధించితిమి. ఇంతటితోనే సంతోషింపరాదు. ఇల్లలికినంతనె పండుగయగునా? ముందున్నది ముసళ్ళపండుగ. సీతావియోగమున రాముడు పరితపించుచున్నవాడు కాని, అతనికి నెవరో వసిష్ఠుడట, రామదేవుడట; యెప్పుడు చూచినను వేదాంతము జెప్పుచుండుటచేత వాడు చావకున్నాడు.

కరా—కానిమ్ము. ఆ మునిముచ్చులపని తర్వాత తీర్చెదము వారికి కండకావర మెక్కువయైనది.

శూర్ప — ఇంక మనము వచ్చు విడితిరుగా వచ్చునుగదా ? పోవుదము రమ్ము ?

కరాళ — నీవు న్యాయముగను, ఊరకుండుము, ఆయాంజనేయుడను కోతి యిపుడు దూరములేడు. మనపని కొంచెము క్లిష్టమైనది.

శూర్ప — వానిభయము నాకంతలేదు, కాని మాయున్న విభీషణునిదే నాకు భయము. నేనొక్కవైపునను నీవొక్కవైపునను పోయి మన కార్యము ఫలించినదా లేదా యని కొంతకాలము కాచుకొని యుందము. ఒకవేళ యింతలోనే రాముడు మృతిజెందిన నది భాగ్యవిశేషమే కదా?

కరాళ — 'మృతుడయ్యెనా?' ఏమట్లు మాటాడుచున్నావు? ఇంకను సందేహమా? ఇపుడె మనము పట్టినదంతయు బంగారమగుచున్నది.

శూర్ప — ఇంకొకటి వినెదవా ? మొన్న పట్టాభిషేకమప్పటినుండి మాయన్న రావణుడు రాముని బట్టియున్నాడట! ఎందరెందరో భూతచికిత్సకులు, మహానీయులు వచ్చి చూచుచున్నారట. ఇది మిక్కిలి మనకు సహకారిగదా?

కరాళ — ఔను. ఇక పోవుదము రమ్ము (అని పోబోవ నాంజనేయుడు వెనుకనుండి వచ్చి జారిన చెవి యొక చంకలో నిరికించుకొనుచు.)

(అనుబంధము 40) (నిష్క్రమించును)

---

## తృతీయరంగము

### స్థలము - భాగీరథీతీరారణ్యము

[ప్రవేశము : రాముడు]

శ్రీరామ — అహా! గోరుచుట్టుమీద రోకలిపోటువలె నాకిట్టి దుర్దశ రాదగునే ? హతభాగనై, అపగతవివేకమై, యీరాముని బ్రతుకింతనిరర్థకమగునే? సూర్యవంశపు గౌరవమెల్ల నశింపజేసితిని.

సహియింపరాని జనాపవాదశూలములఁ పాలైతిని. ప్రాణాధిక ప్రాణ ధనమగు మాసీత నన్యాయముగ నట్టడవిసిదోలి తద్వియోగ దావాగ్ని బొరలనైతిని, నాయనుగుదమ్ములవిషను యుద్ధదేవతకు బలియిచ్చితిని. దేనికి దుఃఖింతును? దేనికై పలవింతును? దేనికి పరితపింతును? ఆహా! మాజానకిం జూపువారు లేరే, అన్ని దుఃఖములను విధి నాకొఱకై సృజించెగాబోలు? నాచే ప్రారంభింపబడిన హయమేధము హయముతోడనే నిలచినట్లయ్యె! ఇన్ని శోకములు నన్నుముంచి చంపినను మానెగాక పరలోకమునందు సైతము రౌరవాదినరకములు నాకై యెదురు చూచుచున్నవి గదా? యజ్ఞదీక్షాకంకణము గట్టుకొనియున్న నేనెట్టు యుద్ధమునకు బోనుదును? దైవమా! నన్నింత విషమపరీక్షణము చేయ సాగితివికదా? కానిమ్ము ఏమేమి యనర్థములు, యేమేమి కష్టములు, యేమేమి విపత్తులు రానున్నవో యనియున్నయు నాకు మహోపకారముగా దలచి పరమ సంతసమున భరించెదగాక. అక్కటా! నిరపరాధ, నిరస్తకల్మషయగు మాజానకిని. పూర్ణాంతర్వత్నిని గుట్టలద్రోలి కిరాతకృత్య మొనర్చిన నాకీగతిగాక మరే గతి రాగలదు? ఆబాలకు లెచ్చటనుండివచ్చిరి? వీరు బాలకులా పరేత పాలకులా? పోయిచూచెదగాక, ఆహాయముండు చోటైన దెలియదయ్యెనే!

సీ. చేరరే కలికిరాచిలుకలార చెలుఁగు
కొరకులార మయూరకలకులార!
కదియరే సీత యానదములార సుశోక
నదములార సుషట్కపదములార!
పరికింపరే భూమిప్రతతులార ధరాజ
ప్రతతులార ప్లవంగపితతులార!
అరయరే కాంత భూధరములార జలాంత
చరములార వనాభ్రచరములార

గీ. వనలతాగారి శైలసమేతులార !
పవనములార మృగేంద్రగణములార !
వినుతభూపుత్రి యపరసావిత్రి యిందు
చూడరే మానినిప్రోడ నిందు.

[ప్రవేశము : అరణ్యకవేషములు లవ-కుశులు]

లవ—ఆహా! ఈమహానుభావు డెవడో దేవాంశసంభూతుడని తోచు చున్నది.

మ. అరరే తేజ మపారమయ్యె గనగా హరిప్రభాయుక్త మీ
సరసీజాతముఖంబు వక్షమును విస్తారంబుగానొప్పెనా
యరుణాబ్జాతము లట్లు నేత్రములు మా కానందమున్ గొల్ప నీ
ధరణీశేంద్రు డెవండో స్వర్గహరియో దైత్యారియో నారయన్.

కుశ—ఇతనితో బోరి జయించుట కష్టసాధ్యమనియు దోచుచున్నది.

శ్రీరామ—బాలకులారా! మిమ్ముజూచిన నీయరణ్యవాసులని స్ఫురణ గలుగుచున్నది. ఈకాననమున మాయశ్వమేధహయము నెవ్వరో మూర్ఖులగు యిరువురు మునికుమారులు పట్టి యున్నారట అది యెక్కడనున్నదో చూపగలరా ?

లవ—అశ్వమున కేమి ? చూపెదము. కాని మీ కాతురంగముతో నేమిపని ?

శ్రీరామ—అది నాసవనాశ్వము. ఆ ద్విజకుమారులజయించి దానిని గొనిపోయి యజ్ఞమును సాంగము చేయవలయు ననుటయేపని.

కుశ—ఆ బాలురు సాధారణముగ జయింపబడువారు కారే ? యిప్పు డేమి చేసెదరు ?

శ్రీరామ—అది నాకును దెలియును. అయినను నేను వారిని జయించియే తీరవలయును. జయాపజయములు దైవాధీనములే కదా ?

లవ—అయిన మీపేరేమి ?

శ్రీరామ—నాపేరు శ్రీరాముడని లోకులందురు.

కుశ—ఇప్పుడు మాచే....కాదు....మునిబాలురచే జయింపబడిన వారలెవ్వరు ?

శ్రీరామ—వారు నా తమ్ములు. భరత లక్ష్మణ శత్రుఘ్ను లనువారు.

లవ—వారు మీకు కావలయునా? ఆగుఱ్ఱము మీకు కావలయునా ?

శ్రీరామ—అంతఃకరణమునుబట్టి వారును కావలయును ప్రకృతి కార్యమునుబట్టి తురంగమును కావలయు.

కుశ—మీ కాయశ్వముజూపిన మాకేమిబహుమాన మిత్తురు ?

శ్రీరామ—తురంగముతప్ప మీరు కోరినదాని నిచ్చెదను.

లవ—అయిన మీగుఱ్ఱ మిచ్చటనే యున్నది చూడుడు ? (అని చెట్టుమఱుగున నున్న యశ్వమును జూపును)

శ్రీరామ—ఇదియే మాయశ్వము. అయిన దీనిని గట్టిన వీర శేఖరు లగు బాలకు లేరీ ?

కుశ—గొప్పవారు మీ రపేక్షించిన వారు దూరముపోవుదురా ?

శ్రీరామ—ఏమీ! సమీపమున నున్నారా ?

లవ—సమీపమున నేననేల? ఇందే యున్నారు చూడుడు. (తమ యరణ్యవేషములదీసి ధనుర్ధారులై యెదుట నిలువబడుదురు)

శ్రీరామ—(స్వగతము) ఆహా! వీరా కుమారులు ? వీరిగాంచిన నాకేదో యొకవ్యక్తి మనసున బొడకట్టుచున్నది. ఈరక్తరేఖాంచిత నేత్రములు, ఈసిడుదయురము, ఈపున్నమచందురుబోలు నెమ్మోము చూడ, వీరిని ముద్దాడవలయునని తోచుచున్నది. కాని కార్ముకముపై చేయిపోవకున్నదికదా!

సీ. మోములదిలకింప ప్రేమయొప్పనుగాని
కోపంబు నెమ్మది గూడబోదు
పలుకులవిన వేడ్క యొలుకునే కాని నా
వీరసూక్తుల మోము చేరజనదు

అంగశృంగారంబు నట్టె చూచునుగాని
కనుదోయి కిన్క కెంపెనయఁబోదు
ధైర్యంబుఁగన సద్భుతము గల్గునేగాని
కార్ముక మొగిఁబట్ట కరము చనదు
గీ. భళిరె యీ బాలకులజూడ భావమలరె
చెలువు మాజానకీదేవి చిన్నెలమరె
వీర లెవ్వరో ధీరతాసారులౌర
వీరవర్యులు బాపలు వీరుకారు.

లవ—ఇక మీ యభీష్టము దీర్చుటయేకదా తమకు కర్తవ్యము?

శ్రీరామ—ఈ రాముని చరిత్రము మీరు వినలేదో? ఇచ్చిన మాట తప్పుట యూ? అది యెట్టిది?

కుశ—కౌసల్యా! మా గురువులవలన మీ గుణాతిశయములను విని యున్నారము. ఐనను నీ కాలమున గొప్పవారిని మాత్రము నమ్మ రాదు.

ఉ. పెద్దలు పెద్దలంచు తగుపెత్తనముల్ నొనరించు ధర్మపుం
సుద్దులఁ జెప్పుచుందు రిల చూడఁగఁ జేయుటయన్న సున్నయా
పెద్దలు లోకమందు బలుపెద్దలు వారిని నమ్మఁజాల నే
పెద్దలు దేశవృద్ధి నిటు పెంతురు నట్టిల కేను మ్రొక్కెదన్.

శ్రీరామ—తొలుత మీ యభీష్టమేమో యడుగుడు.

లవ—మాకేమియు నభీష్టమువలదు. మీరు యుద్ధరంగమునుండి తొలగ మాకు రణదాన మొసగిన సర్వాభీష్టములు సమకూరినట్లే.

శ్రీరామ—(నవ్వి) బాలకులారా! మీ ముద్దారు పలుకులు నామది కెంతయు వారవశ్యము నిచ్చుచున్నవి. మీకు త్రిలోకాధిపత్య మిచ్చినను నాకు దృప్తి కలుగదు. అయినను నీదానము మీ కేల

మ. వసుధన్ వేఁడుటో వన్నెసొమ్ములను వాంఛించుటో, పిండివం టలు నాశించుటో, విత్తమున్ మదిని వేడ్కన్ కోరుటో, దంతివా

జుల కాంక్షించుటా, చూడ ధర్మములు మీక్షోణీసురేంద్రాళికిన్ కలనైనన్ రణ మిచ్చి గోరనగునే కాంచంగ నో బాలకా.

కుశ—పరాక్రమమే భూషణముగా, శూరత్వమే జీవనముగా, ప్రజాపరిపాలనమే ముఖ్యధర్మముగా నెంచు మాకు రణ మపేక్షణీయ మగుగాని! యుదరభరణ మపేక్షణీయమా?

శ్రీరామ—ఐన మీరు క్షత్రియకుమారులా?

కుశ—అది నోట వేఱు చెప్పవలయునా?

శ్రీరామ—మీయట్టి శుభమూర్తుల, మీయట్టి యభినవకందర్పుల, మీయట్టి విక్రమధనుల గని మధ్యమలోకము కొఱకె పెట్టనివిభూషణ మొసంగినధన్యు లగు మీజననీజనకు లెట్టి మంగళాక్షరము లచే నలంకృతులో వచింపగలరా?

లవ—(జనాంతికము) సోదరా! ఏమి యీ మహాపురుషుని వాగ్జాధుర్యము? ఏమి యీ వచనచాతుర్యము?

కుశ—ఇట్టిమహాశయునితో మాటలాడగలుగుట మనతల్లి యాశీర్వచనప్రభావమేకదా?

లవ—సంగ్రామలాభము కలిగిన మఱియు మేలు. (ప్రకాశము) ఆర్యభూషణా? ఇది కదనరంగముగాని బంధువావి వరుసల నడగుటకు పెండ్లింటి భోజనము కాదు.

కుశ—మీరేమి యశ్వమేధయజ్ఞములు చేయదలచుకొన్నట్లు లేదు.

శ్రీరామ—ఏల?

లవ—లేనిపోనిమాటలతో ప్రొద్దుపుచ్చువారలకు కార్యమన్న సున్న.

శ్రీరామ—కుమారులారా? మీరీతురగమును బట్టుటతగినపని కాదు అందును మీశౌర్యము మాతమ్ములయందు సార్థకమయ్యె నని తలపకుడు, మీమోహనాకారముల గాంచి వారు పరాకున మీచే వంచితులై నిర్జింపబడియుందురు. అంతమాత్రముననే యంతటిసాహసమునకు మీరు పూనుటమిక్కిలిలగ్గుగాదు నామదియు

మిమ్ము జూచినది మొదలు కరుణాంతరంగితమైనందున నందున్న ప్రతాపాగ్ని చప్పచల్లారినది.

కుశ—మీ రేమి క్రిందపడినను పై చెయ్యనుచున్నారే? మీతమ్ముల మాటటుండనిండు. మీ రేమి యుద్ధమున కుపక్రమించెదరా? లేక మాతో సంధిచేసికొనియెదరా? 'బాలకుల కేల యుద్ధము' అంటిరి కదా? అది మిక్కిలి పొరపాటు. ఏయభ్యాసముకాని బాల్యము నుండియే యలవడవలయు.

శ్రీరామ—ఇంక నాయత్నము లేదు బాలులారా! మా గురువులు స్త్రీ శిశువులతో బోరరాదనినందున నింత వచించితిని. కాని రావణమారణమున దృప్తినొందకున్న నాబాణములకు మిమ్ము బలి యివ్వజాలక కాదు.

లవ—గురువాక్యపరిపాలనమన్న మొదట మిమ్ము జెప్పవలయు. ఆ నాడు తాటకను చంపితిరే? అదిగురువాక్యమా? లఘువాక్యమా?

కుశ—అతికాయునితో బోరునప్పు డీగురువాక్యమును మరచిపోయి యుంటిరి గాబోలు?

లవ—మాగురువాక్యము వినలేదే? లోకమున నెవరైన మాగురువు లట్లు చెప్పినారని చేయరాని కార్యముల జేయువారిని మాగురువులు కలలోవచ్చి యిట్లు చేయుమనిరని పలుకువారిని, మాగురువులకు గాను మీరు మాకు ధన మొసంగుడని మోసగించువారిని నమ్మరాదని చెప్పియున్నారు.

శ్రీరామ—సీ. స్త్రీ బాలకులఁజంప చెలఁగుపాప మటంచు
పలికిరి గురువు లో బాలులార!

కుశ—తాటకఁ జంపుచో నేఁటికి యీబుద్ధి
కలుగకపోయెనో పలుకుమయ్య!

లవ—అతికాయుతోఁ బోరుమని నీదుతమ్మునిఁ
బంపుచో గురువు వచింపలేదె

శ్రీరామ—ధరణివిభుండౌట తండ్రిసి విూకౌదు
తండ్రితో యుద్ధంబు తగునటయ్య
కుశ—ధరణివిభుం డీవు తగ లోకవిభుఁడు మా
తండ్రి యాతనిమేముఁ దలఁతుమయ్య
శ్రీరామ—ఎవ్వఁడు మీతండ్రి? యెట్టిరూపమువాఁడు
యెందు తానున్నాఁడు! యెట్టివాఁడు?
లవ—దేవుఁ డాతఁడు నీలదేహముకలవాఁడు
ఎల్లడనున్నాఁడు ఎల్లనతఁడు
శ్రీరామ—అతని పే రెయ్యది! అతఁ డెప్పుడేటువచ్చు
అతనిఁగాంచెడివార లరయ నెవరు?
కుశ—అన్ని పేర్లతనివే యతని చేరఁగ రాదు
యోగులు చూతు రాయోగపురుషు
శ్రీరామ—మీతల్లి యేసాధ్వి మీ రిందునుండుట
కరయఁగారణ మేమి యనుగులార
లవ—గీ. సర్వలోకైకజనని మాజనని యుందు
చేరియుండగ హేతువు చెప్పరాదు
శ్రీరామ—కనుల మిమ్ముఁగాంచ నేలకో కరుణగలిగె
కుశ—కరుణగాదది నీచేగానితనము.
శ్రీరామ—చాలు నధికప్రసంగము. తాటకను చంపుట మాగురువుల యానతిచేతనే. అది యుండనిందు మీగురువు లెవరు?
కుశ—వాల్మీకి మానీంద్రులే.
శ్రీరామ—వారివద్ద మీరు విద్యాభ్యాసముఁ జేసితిరా? (స్వగతము) హృదయమా! తొందరపడకుము. నీసంకల్పము సత్యమా యసత్యమా యని తెలిసికొనకనే చెదరకుము. (ప్రకాశము) మీరు వాల్మీకిశిష్యులా? మఱియు మేలయ్యె. వారు మీకు బోధించియే యుందురుకదా!

కుశ—ఓ; చెప్పియున్నారు.

శ్రీరామ—ఎట్లు?

లవ—పట్టినపట్టు వదలరాదనియు, క్షత్రియధర్మము పాలింపవలయు
ననియు, అదియే వీరధర్మమనియు.

శ్రీరామ—ధనుర్విద్య నభ్యసించెడి విద్యార్థులు వీరులగుదురా?

లవ—ధనుర్విద్యాభ్యాసకులు వీరులగుదురు గాక! పట్టిమాటలాడువారు
వీరులగుదురా?

శ్రీరామ—రాజనీతియందు మెక్కుడగువానితో బోరరాదని చెప్ప
బడలేదా?

కుశ—ఎదుటివారు మాకంటె మెక్కువ వీరులైనగదా?

శ్రీరామ—ఇది మీకు గర్వము కాదా?

లవ—ఇది మీకు దురభిమానము కాదా?

శ్రీరామ—దేహమును వ్యర్థముగ పోగొట్టుకొనవచ్చునా?

కుశ—కనుకనే యీసాహసమునకు బూనితిమి.

శ్రీరామ—పోనీ. మీతల్లిదండ్రుల యాజ్ఞనైనబొంది యున్నారా?
వారీగుఱ్ఱమును పట్టుడనిరా?

లవ—ఏమయ్యా! నీవు మంచిగట్టివాడవే? మెడకు వేసిన కాలికి,
కాలికివేసిన మెడకు వేయుచున్నావే?

కుశ—మాతల్లి మాకు స్వధర్మములను రక్షించుకొని తనకుకీర్తిని
తెమ్మని చెప్పినది మాతండ్రి దేవుడు! గనుక ఆయనయు స్వధర్మ
త్యాగము జేసి పరధర్మము నాశ్రయించి దేశమును, కులమును
నాశనముచేయుమని చెప్పలేదు. తెలిసినదా?

లవ—ఇతడేమియుద్ధము చేయునురా? మాటలు కోటలు దాటు
చున్నవి, కాని కాలు గడప దాటకున్నది? తమ్ములపాటుజూచి
నను నితనికి కోపమే రాదుకదా!

శ్రీరామ—ఆహా! ఇంక తడయుట దుస్సాధ్యము కలుషాత్ములారా, ఇక మిమ్ము విడువను. (అని దారుణాస్త్రముల బ్రయోగించును. అవి పూలహారములై వారికంఠములబడును.) ఔరా! ఇదియేమి యాశ్చర్యము? నాబాణములు పూలహారములైయుండునా (కోపముతో) ఇప్పుడైనను మీయజ్ఞానము వదలెదరా లేదా? (అని నారాయణాస్త్రమును తొడుగును.)

కుశ—(జనాంతికముగ) ఆహా! ఈయుగ్రాకారము కనులకు మిఱుమిట్లు గొలుపుచున్నది గదా? ఈభయంకర తేజముచే మనకు బాణాసనముపై చేయియే పోకున్నదికదా?

లవ—ఊరక మనతల్లివద్దకు పోవుదమురమ్ము.

కుశ—(అస్త్రమును తొడిగి)

గీ. మహిని మాతల్లి లోకైక మాతయేని
ఆమె సత్కీర్తి జగముల నలరునేని
జనని మాజానకీదేవి సాధ్వియేని
ఇతఁడు నీయస్త్రమున మూర్ఛ నెనయుగాక.

శ్రీరామ—హా! జానకి! జానకీ! (మూర్ఛపోవును.)

[ప్రవేశము : శీఘ్రముగ శూర్పణఖాకరాళులతో ఆంజనేయుడు శ్రీరామునివద్దకు వచ్చిచూచి]

ఆంజ—రామా! రామా! రామా! లోకాభిరామా! ఈదేవుడు మూర్ఛిల్లియుండుట కేమికారణముండవచ్చును? (బాలకుల జూచి) బాలకులారా? మీరేనా మారామచంద్రుని మూర్ఛనొందించినారు?

లవ—లేదయ్యా! అతడే యేలనో మూర్ఛిల్లియున్నవాడు.

ఆంజ—కల్ల. మిమ్ము విడువను, చచ్చితిరిక నాముష్టిఘాతమున (అని చెయ్యెత్తును. లవకుశులు రామధ్యానము జేయుదురు.)

(అనుబంధము 41)

(ఆంజనేయుడు నృత్యముజేయుచుండును. లవకుశులు రామధ్యానము చేయుచు నిష్క్రమింతురు ఆంజనేయుడు వారిని వెంబడించును.)

(యవనిక పడును)

---

## చతుర్థరంగము

స్థలము—పర్ణశాల

[సీతయును వాల్మీకులును కూర్చుండి యుందురు]

వాల్మీకి—అమ్మాయీ! ఇంతలోననే వత్తురు. నీకుమారుల కెందైన నాపదకలదా? ఊరడిల్లుము.

సీత—జనకా! ఇంతకాలము నన్ను బాలించితివి. రామదర్శన భాగ్యము నాకు గలదా?

వాల్మీకి—అమ్మా! అంతయు దెలియగలదు. ఒకక్షణములో నీవు నీ నాథునితోఁ జేరుదువు. సత్యము. సంధ్యావందనము, దీర్చి వచ్చెదను. ఏమియు భయపడకుము.

(నిష్క్రమణము)

[ప్రవేశము : కుశకుమారుడు]

కుశ—తల్లీ నమస్కారములు.

సీత—జయసిద్ధిరస్తు. కుమారా! నీతమ్ముడేడీ?

కుశ—అమ్మా వెనుక వచ్చుచున్నాడు.

సీత—మీకు జయమే కలిగినదికదా?

కుశ—తల్లీ! అంతయునీమహిమయే, అశ్వమును సాధించితిమి.

సీత—వారేమైరి? వారు శూరులేనా?

కుశ—లోకైకవీరులనవచ్చును. వారు నీ వుపదేశించిన మంత్రము చేతనే మూర్ఛిల్లిరి. తుదకెవరో యొక మహాపురుషుడు నీలమేఘ శ్యాముడువచ్చెను. అతనిబాణాగ్ని మమ్ములనుగాల్చుచుండెను,

మేము నీధ్యానము నొనర్చితిమి. నీపేరు వినగానే యతడు క్రింద పడియె. అతనివద్దనుండి యీ మాణిక్యమును దెచ్చితిమి.
(మాణిక్యమునిచ్చును.)

సీత—(రిచ్చవడి మాణిక్యమునుచూచి) ఆహా! రామా! రామా!
(అని క్రిందపడును.)

కుశ—తల్లీ! తల్లీ! (అని శైత్యోపచారముల జేయును.)

సీత—(లేచి)కుమారా! ఆమహానుభావుడు, ఆ నీలమేఘశ్యాము డెచటనున్నాడు? ఎట్లున్నవాడు? అయ్యో! అలనాడు మే మరణ్యమునకు బోవునపుడు మాయత్త కౌశల్యాదేవి రామచంద్రునకు గట్టిన రత్నమణికదా యిది?

కుశ—తల్లీ! తల్లీ! రాముడెవరు? నీవు శోకించుటకుగారణమేమి? తెలుపుము తెలుపుము. నీకు నమస్కరించెదను. తెలుపుము.
(అని కాళ్ళబడును.)

సీత—అయ్యో! అతడు మీదైవము మీగురువు మీపాలకుడు,

గీ. మీదుదైవంబు మీదాత మీగురుండు
మీ నిదానంబు భాగ్యంబు మీదుస్వామి
మీదుజీవంబు మీగల్మి మీధనంబు
మాకులాధ్యుండు మీతండ్రి మీకు లేడు.

కుశ—అమా! మేము కలుషాత్ములమైతిమి. పితృహింసకులమైతిమి. మాగతియేమి? నీవేలమాకు జెప్పకపోయితివి?

[ప్రవేశము : లవకుమారుడు పాడుచు. వెంట ఆంజనేయుడు]

(శూర్పణఖాకర్ణాభరణము)

(అనుబంధము 42)

ఆంజ—(ఆశ్చర్యమున) ...ఆహా! మాజానకీదేవి!! మాలోకమాత!! మాతల్లి!!!! (నమస్కరించును)

సీత—(సంభ్రమముతో) అన్నా! మారుతీ! నీ వెక్కడనుండి వచ్చితివి? నా ప్రాణవిభు డెట్లున్నాడు? ఆ దేవు డెట్లున్నాడు? చూచితివా నా స్వామిని!

ఆంజ—తల్లీ! రామచంద్రమూర్తి యుద్ధమునకు వచ్చినాడన్న యుదంతము విని తపము జేయుచున్న నే నాతని దర్శింప వచ్చితిని. రాముడు మూర్ఛిల్లియుండెను. ఈ బాలకులు నీకా రామసంగ్రామము చేసి నన్ను గట్టివైచి నీయొద్దకు గొనితెచ్చిరి. వీ రెవరు?

సీత—మారుతీ! పితృఘాతకులైన నా యుదరమున దురదృష్టవశమున జనించినవారు.

ఆంజ—వీరు నీ నందనులా? మా స్వాములు కదా వీరు? నా చిన్న ప్రభువులు కదా వీరు? నేను ధన్యుడ, నేను కృతార్థుడ.

(అని నిష్క్రమించును)

సీత—జననీతనయా! మా రామచంద్రుని నాకు జూపుమా, మా దేవ దేవుని నాకు జూపుమా? అక్కటా! దిక్కు లేక యనదనై యున్నను నతని క్షేమవార్త వినియైన సంతసించుచుంటినే? ఇక నాగతి యేమి? నాకేది గతియగును? హా! శ్రీరామా!

[ప్రవేశము వాల్మీకి, జనకుడు]

వాల్మీ—జానకీ! జానకీ! భయపడవలదు కుమారీ! నీనాథుడు నీపేరు విన్నమాత్రమున నధికదుఃఖార్తుడై యున్న కారణమున మూర్ఛిల్లి యున్నవాడు. ఈ కుమారులు నీ కుమారులని తెలిసినందున దుఃఖశ్రమాధిక్యమువలన కలిగిన పారవశ్యము కాని వేరపాయము కాదు పోదము రమ్మా రామచంద్రునొద్దకు; కుమారులారా! మీ జనకుని దర్శింతురు గటరండు

జన—తనయా! ఇదియే నీసంతోషసౌధమునకు ద్వారము. నీకు గలిగిన యపవాదమును మాపి శుద్ధమాయాస్వరూపిణివై వెలుగొందుము.

లోకనాథులగు సీతారాములు గాంచి జగము సంతసించుచున్నారు. రమ్ము పోవుదము.

[ప్రవేశము ఆంజనేయుడు, శూర్పణఖాకరాళులతో]

ఆంజ—(వాల్మీకులకు నమస్కరించును)

వాల్మీ—పావనీ! మంచివేళకు వచ్చితివి నీవు లేని రామాయణము కలదా? పోదము రమ్ము. (నిష్క్రమింతురు)

---

## పంచమాంకము

### ప్రథమ రంగము

యుద్ధభూమి

[శ్రీరాముడు పరుండియుండును, జనకుడు కూర్చుండి యుండును. వాల్మీకులు ప్రక్కనకూర్చుండి యభిమంత్రింతురు]

శ్రీరామ—(లేచి) మునీంద్రా! వాల్మీకి చంద్రా! తమ దర్శనము నా కెట్లు కలిగె? ఏరీ ఆ కుమారులు లేరీ! త్రిలోకవీరు లేరీ? జానకీ వరపుత్రులేరీ! చూపుమా చూపుమా!

[ప్రవేశము ఇరుప్రక్కలనుండి పాడుచు శీఘ్రయానమున లవ-కుశ కుమారులు]

(అనుబంధము 43)

శ్రీరామ—కుమారరత్నములారా! శూరవతంసములారా! ఈ పాతకుని నేల వేడెదరు? వీడు మీకు దండ్రికాడు. క్రూరుడు; కిరాతకుడు; హా! సీతా! నా యంత్యకాలము సమీపించుచున్నది! నామానసమును నాసర్వాంగములును తాపబాధితములై యున్నవి. లోకాపవాద మూలమున నిన్ను గన్నులార జూడకున్నాడను. మదియందు నిన్నే ధ్యానించుచున్నవాడ.

వాల్మీ—రామచంద్రా! పరమవిజ్ఞాన ధనులగు జనక రాజేంద్రులు మిమ్ము దర్శింప వచ్చియున్నారు.

శ్రీరామ—రాజేంద్రా! మిమ్మిందు దర్శించుటచే ధన్యుడనైతిని.
(అని నమస్కరించును)

జనక—రామా! నిన్ను దర్శించుభాగ్య మెన్నిజన్మములు తప మొనర్చిన గలుగవలయు?

[ప్రవేశము : శూర్పణఖాకరాళులతో ఆంజనేయుడు]

ఆంజ—(శ్రీరామునకు నమస్కరించును)

శ్రీరామ—అంజనీతనయా! నీ వెప్పుడు వచ్చితివి? ఈ శూర్పణఖను నీ వెట్లు తెలిసికొంటివి? ఆహా! జానకీ నిరపరాధవగుట జగమెఱిగి యున్నను నిన్ను గటిక మానసమున నడవిద్రోలిన నిర్భాగ్యుని నొకతూరి చూచుట మహాపాతక కార్యము. అయినను యేదీ నీ మోముదమ్మి నొకపరి నాకుజూపుమా, నాకు మాపణగై కొమ్మా.

[ప్రవేశము : సీతపాడుచు)

(అనుబంధము 43)

శ్రీరామ—(ఆలింగనము చేసికొని) జీవితేశ్వరీ! ఈ కుమార హింస కుని, నిండుగర్భిణి నించుకంతయు నక్కటికములేక బాధించిన పాపాత్ముని జూడగల్గితివిగా? ఇదియే నీవరపురంధ్రీ చారిత్రమును సూచింపుచున్నది. నన్ను మన్నింపుము: నాయపరాధముల మది నుంచకుము అటులైన నా యంతర్దహనాపశ్చాత్తాపము తీరగలదు.

(అనుబంధము 44)

సీత—నాథా! అంతయు నా పూర్వార్జితఫలము; ఇందు నీ యపరాధ మేమున్నది? సర్వభూత దయామయుడగు నీ కిట్టిబుద్ధి కలుగ వలయునన్న నాగ్రహచారము కదా!

ఆంజ—దేవా! ఇది మీయపరాధముకాదు. ఇదియంతయు నీ దురా త్ముల కృత్యము (అని శూర్పణఖాకరాళులనుచూపి) వీరు చాకలి వేషముల వేసికొని మిమ్ము మోసగించిరి.

వాల్మీకి—దేవా! ఇది యంతయు నీకు స్వప్నముకాదు వేరుకాదు. అది తీరిపోయినది ఇది సమ్యోగ్యకాలము ఈ కుమారులను నా యెదుట యువరాజపట్టాభిషేకము చేయుము.

జనక—సీతారాములారా! ఇపుడు నాకు మిక్కిలి సంతసము, నాడు మిథిలాపురమున మీ వివాహమునాడు మిమ్ము జూచుటచే గలిగిన సంతస మిప్పుడు కలిగినది. నా దౌహిత్రుల యౌవరాజ్యాభిషేక మహోత్సవము కన్నులార జూడవలయునని యున్నవాడ; దాని కనుమతింపుము.

శ్రీరామ—మునీంద్రా! నాతమ్ములు?

వాల్మీ—సందేహము లేదు. వారు అయోధ్యా పట్టణమున నపుడే మేల్కాంచి యున్నారు.

శ్రీరామ—ఆంజనేయా! ఈ శూర్పణఖాకరాళు లపరాధులైనను నిట్టి సంతోష సమయమున దండింపరాదు. వీరి కభయమిచ్చి యున్నాడ.

(ఆంజనేయుడు శూర్పణఖాకరాళుల విడిచిపెట్టును
వారందఱికిని నమస్కరింతురు)

లవ-కుశ కుమారులను కూర్చుండబెట్టి పట్టాభిషేకము జరుపుదురు.

(అనుబంధము 45)

మంగళము.

# అనుబంధములు

### 1 మాల్‌కోస్ రాగము—చాపుతాళము

అందఱు—కృపారామ - శ్రీరామ - నారాయణా
అపారాగ - ముద్ధార - ఆలింపుమా॥ కృపా॥
మహాదైత్యసంహార - మానాయకా
మనోభక్త - సంరక్ష - మందారమా కృపా॥
మునీంద్రా మనోవాస - దీనావనా
ఘనాధామ - శ్రీరామ - ఓరాఘవా కృపా॥

### 2 సౌరోజురాగము—ఏకతాళము

అందఱు—ధరణిని - స్థిరంబునేలు - రఘువర
సుఖంబుగను - జనంబులన్
భరతు—ఖేదములన్–వాదములన్–భేదములన్ - పోవగా–సాదరమతి స–
మ్మోదము చెలగను–సోదరులకు–నెల్లరక్షోవుముదయ రఘు॥
శత్రుఘ్ను—ఇన్నాళ్ళకును - కన్నారగా- నిన్నిందుల - కన్గొంటిమి
కలుషము చనెస - త్ఫలములు వెలిగెన్ - బలువెతలడగెన్
రఘుకులాభరణా॥
ఆంజ—రామా - సుమచిరదనుజ భీమా - రవికులదివర - క్షేమా
రగనిలవెలయున్ భూమిని - అది వర - కరుదుగ - ధరణిని
మనుపుము రఘు॥
లక్ష్మణ—పరులై–సుఖతత్పరులై–పతిభక్తిరతులై–తగుసుందరులను -
మనుపన్–ఘనసతులై–శుభరగధ - ర్మము నెపుడున్ - నిలుపు
దయ్యా–పన్నగ - నాదరమెన్నగ - సందుచెన్నగ - బ్రోచు
చున్నతరఘుమణీ ధర॥
సీత—వాణుల్–బుధగీర్వాణుల్ - శృతినింద్రాణుల్ - మణినింద్రార్ణం
బులున్ - శుభంబు - సలలిత–సుఖంబులొసగుత రఘు॥
శ్రీరామ—ఇందిర–రమణుడునిటు–మమ్మిందు - ఆనంద–ములరగనిటు–
లొందింప–మీరందర–రనుపమదయ డెందంబు - మీరన్ బ్రోవ

గన్ — అందు నేలెదన్ — అందముమీరన — మందశుభోదయ
మొందుదు నోసఁగుడు॥

3 నాటకరంజిరాగము—ఆదితాళము

సీత—ధీరమారుతీ రమ్మా - వీరాగ్రణి
కోరి రామవార్త కూర్మిఁ దెల్పినట్టి ధీర॥
శోకసంభ్రమందు - సొలసియున్న నన్ను
వీకఁబ్రోచినట్టి - వాయుకుమార యిందు ధీర॥

4 మాల్‌కోస్ రాగము—ఆదితాళము

ఆంజ—అమ్మాకోతికి మణి హార - సుదేలా
ఇమ్మారాముని - పాదభక్తిని అమ్మా॥
రాముఁడె దైవము - రాముఁడెభావము - రాముడె ప్రాణము
రామనిధానము అమ్మా॥
రామారాఘవరామ - ప్రేమంపుకరుణను
నామానసంబున - తిరముగనిలుమా
నీమహిమంబును - నేర్తునే తెలియగ
ఇమ్మాజ్ఞానము - ఇనకుల భూషణ అమ్మా॥

5 కాఫీరాగము—ఏకతాళము

ఆంజ—కనుగొంటినాదైవంబును
కనుగొంటి శ్రీరాము నభిరాముని కను॥
కనుగొంటినాభాగ్య సుఫలంబును - కనుగొంటినా తపో
పుణ్యంబును - గనుగొంటి శ్రీరామ తత్వార్థము కను॥
ధన్యుఁడనైతినే - మాన్యుండనైతిగా
చెన్నారనానోము - లీడేరెగా కను॥

6, 1 వ పాటయే

వృ ష భ గ తి ర గ డ

7 యదుకులకాంభోజిరాగము—ఆదితాళము

రామ—కానజానకిసూనసోనలు—కానకానగనయ్యేమానిని
సీత—తేనెవానలసూనమానగ—తేటులాటలపాటపాడవే

రామ——వారిసీరజవారమారగ – నచలించుగ సంచరించెగ

సీత——కోరిసారసకీగవార చ – కోరబృందము నందమొందెను

రామ——సీతశీతలకాంతగాత్రక – చిత్రలాస్యము నేత్రపాత్రము

సీత——భీతవాతసుపోతవ్రాతము – నేతరించెను సాతిమోతత

రామ——బాలబాలరసాలసాలపు – పాళు లలరెను పోలుపు మీరగ

సీత——నీలతాలతనూలజాలము– నిరతపాంథ సుఖంబు నించదె

8 సురటిరాగము—— రూపకతాళము

సీత——వనసీమ–కరుగగనా–కానతిచ్చిబ్రోవుమా
ప్రాణనాథమానమనుచు–పలుకకుండ వేడుదాన ॥వన॥

రామ——ఎలనాగ–యీవాంఛ–ఏలకలిగెనీకు–పలుబాధ
కలిగించు–బాలఘోరకాననంబు ॥వన॥

సీత——మునిభార్యలను జేరి–మనసార నుండకోర్కె మొనసె
నాకు రామచంద్ర–కనికరంబు చూపుమా

రామ——మొన్నగదా–మునిభార్య–లున్న కానమాననయ్యె
ఎన్నవలదీ కానికోర్కె–నన్ను తాంగి వలదువలదు ॥ఎల॥

9 కేదారిరాగము——రూపకతాళము

సీత——దయగనుమారమణా–తాపసాశ్రమంబు జేరి ॥దయ॥

రామ——ఇదితగునా–లలనా–యేలయిట్టివాంఛితంబు ॥ఇది॥

సీత——నా–థా–ఆ–టిం–పు–మా ॥దయ॥

రామ——బా–లా–మే–లా–యీ–లీ–ల ॥ఇది॥

సీత——కీడో–మేలో–వీడ–జాల–వేడుదాన ॥దయ॥

రామ——కాన–నంబు–కాన–లేదె–మానుమింక ॥ఇది॥

సీత——మునిభా–ర్యలతో–ఘనలీల–లనే–గనగన్ మనుపవె ॥దయ॥

రామ——వనజే–క్షణనీ–మనమీ–గతికిన్–చనగన్–వలయునె ॥ఇది॥

సీత——నమ్మినభామినితా–నెమ్మదికోర్కెలను–యిమ్మని
వేడగను–నొసగక మసలుట యుచితమె ॥దయ॥

రామ——సుందరియీగతినా–నందమె కానలనీ–వొందితి
మొన్ననుగా——అడుగక నడుగుముపడతిరో ॥ఇది॥

సీత—మానసాబ్జా—రామా

కానలకై నా—నేగగ మనమున దండ్రి ॥దయ॥

రామ—దైవాయత్తం—బేమో—

తలపగ జానకి నే—తాపము—తలగనీ తలపగ ॥ఇది॥

10 వసంతరాగము—ఆదితాళము

రామ—పల్కజాలనే—పాపపుమాటల

పరమ హేయములౌ—పాతకమడచి దే

మహాశోక మూ—మానసమందున

మాటల వెలికిని—దాటగనయ్యాదు ॥పల్క॥

11 హిందూస్థాని ఝంఝూటిరాగము—ఏకతాళము

లక్ష్మ—నేమహాపాపమునైతి—పరలోక—దూరుడైతి

అపయశ—బంధనైతి

జననిరో—కాననంబుల విడిచివగ—మనగజాలనే ॥నే॥

ఈమహాతాపమెటులోర్తు—పలుకలగ నెటులనోర్తు

కలుషుడై—గర్భవతిని నీ—కటిక యడవి—నెగనగ ద్రోయగా

12 మాండ్ రాగము—చాపుతాళము

లక్ష్మ—మాతయింత—వంతనిచ్చు—పాపుడ

ఇంతనన్ను—మదినికరుణ—చూడకే ॥మాత॥

అంత మొంద—శాపమిచ్చి బ్రోవవే

సంతసంబు—గల్గునాకు—అమ్మరో ॥మాత॥

సీత—అన్ననింద—లొన్నొ యొంద—నాయెగా

ఎన్నడాయె—కరుణరాము—డేలకో ॥అన్న॥

ఉన్నవృత్తము—తెలియదాయె—కన్నారన్

అన్నియాశ—లట్టెపోయె—లక్ష్మణా ॥అన్న॥

13 ధన్యాసిరాగము—రూపక తాళము

లక్ష్మ—అమ్మరో—అడవి నెట్లువిడతునే

నెమ్మనంబు—తల్లడిల్లె ॥అమ్మరో॥

సీత—లక్ష్మణా! చింతిలవేమి నుమా—నాదుప్రాప్తి—యిట్టులుండె

లక్ష్మ—తల్లీ, వసటగలిగె పెల్లెలిడిచి చనగలనె పుడమి - అమ్మరో
సీత—సౌ-మి-త్రీ-కం-జే-లా-నిట
లక్ష్మ—ఈ రేడు-జగములన్-మునులన్-సురులన్-చూడంగ
అనలంబుననీ వెలయగా మాయమ్మ-పరమసాధ్వినిని
అటవిన్-త్రోయించి-మనగన్-గలనెజనని ॥అమ్మరో॥
సీత—నాదునొసటనిటులన్-విధివ్రాయుట తెలదే-ఇదినాదు
పూర్వజన్మ-పాపమిక మదినడలకుమా ?

14 ముఖారిరాగము—రూపక తాళము

లక్ష్మ—నీ కరుణచె మనకడున్-నరసించిజనని-వరప్రేమను
మమ్మరయగా-కంటె మోజనకతనయ-మనమున
శోకముకలిగెను ॥అమ్మరో॥
సీత—మాయన్న-ఘునపరముగ-నాసేవ సలుపుమగద
వేభక్తి-బలువనములనాకింక-సేసల్-ప్రమోదమున
సలుపన్-మహాత్మలెవ రిటు చెపుమా శుభ మొదవును-
ననుమదిన్ మఱువగవలదు ॥లక్ష్మణా॥

ముఖరిరాగము - రూపకతాళము

లక్ష్మ—నీకయ్యో-దిక్కు-నెవరు-
యీవనంబునందు-తల్లిరో నీకయ్యో॥
లోకజనని-నీకీగతి-శోకముగలిగెనువకటా !
కీకాటవి-కావుడయ్యా-ప్రాకటసురవర్యులారా నీకయ్యో॥
పరమసాధ్వి-నీదుకోడలి-నరయనీకు-నప్పగింతు
కరుణనీవె-చూడుమయ్యా-ధరణిదశరథానీవనీశ నీకయ్యో॥

15 రాగము—తాళము

వాల్మీకి—మానుమింక-తాపము జానకీ
ప్రాణనాథు-కానవౌను-భామినీ మాను॥
లోకమాత-నీవెయేల-శోకము
వ్యాకులంబు-మానుమమ్మ-పావనీ మాను॥

వెతలు బాపు- సుతులగ నెదు-అతివగో
పతిని జేరి-సుఖముగందు-వమ్మరో మాను॥

16 అసావేరిరాగము—ఆది తాళము

సీత—రఘురామ-మనువుమా-రామా
ఎందు నేనీముఖ-చందురుగాంతునో
ఎందునీవగ బాయుదు రఘు॥
జనకులభూషణ ఏలు నూదీనను-రార దే-రామా
రామా

17 కమాచ్ రాగము—ఏక తాళం

లవ—
కుశ— } వరసరోజలోచన రాము-రఘుకులాబ్ధిసుర చిర
సోమ రఘురాము-పరంధాము-అరిభీమా వర॥
ధరణిజామనోంబుజ కామా-సుశర రావదభిరామా
యగనుమా-మదిగొను మా వరనామా వర॥

18 జంఝూటిరాగము—ఏక తాళము

లవ—
కుశ— } ఏలమ్మాయి-దురంతచింత
చాలశోక- మొంద నేల-దురంతచింత ఏలమ్మా॥
కుశ—కన్నులనీరెటు కారగ నేల-మన్నన దెల్పవె మమత చే
తల్లిరో ఏలమ్మా॥
లవు—తనయులమమ్మల-గనియిటుశోకము-గ నగను
నేలను-వినుమదిజనకిరో ఏలమ్మా॥

19 కన్నడరాగము—ఆది తాళము

లవు—ఇటుపిటికిపలుకావినకమ్మాఇవినరులకొండతగదమ్మా ఇటు॥
బాణము చేకొనివై రులజంప మానినక్షత్రియుడో నే ఇటు॥

20 శ్యామకళ్యాణిరాగము—ఆది తాళము

లవ—
కుశ— } రఘురాముని చరితమును-వినుమమ్మా యిక రఘు॥
రాముని సీతా-రాముని దలచిన పాపము తొలగునుగా
లవు—ఖరదూషణాదులను ఖండించెనుగద
వాలినికోలన్ కూలగ నేసెను,

రాముడు రాముడుగా రఘు॥

కుశ—జనకాత్మజనుకూడ—జగమెల్లన్ బరి
పాలనసేయు—భవ్యుడు రాముడు
నారదవంద్యుడుగా రఘు॥

లవ—ధర రావణునిదునిమి—దయచెన్నారెను
రాముడు వేరాముడుకలిగిన—మోక్షముకలుగునుగా॥

21 శంకరాభరణము—ఏకతాళము

జన—విడువిడు బాలకా—మృగమునుబట్టకు
వినోదమా—యిది—ప్రమోదమా విడు॥
ఘనతరమా—గనతరమా
చూడగ వేడుక—కాదిదితలపగ
వినోదమా—యిది—ప్రమోదమా విడు॥

22 హిందోళరాగము—ఏకతాళము

కుశ—దుడుకునపలుకకుమా—యెడరునగు
కడుకొని మృగమును—నెడరునడుగకు దుడు॥
కాలరుద్రుడగు—నేమికావగా—కాలపూనకటునావల
పోమ్మా—చాలవింకవడి—పరుగిడుపలుకక దుడు॥

23 మధ్యమావతిరాగము—రూపకతాళము

బాల—రార వేటలాడుదము రారా—వేడుకలరగా
బలుసింగంబులనెల్లన్—నలుముచుపులులను వేగ
కలచినలచి—వెతలపఱచి—జగమువెనచి—మోదము
పెంచగా రార॥
ఘనకుంజంబులలోనక్—ఘనమహిషంబులమరియు
కరులవెలుల తలలదునిమి పులులనదిమి—భరము
డించగా రార॥
కలకాలమును నెంతో—జనములనంచెడివానిన్
కదలనియక—మొదలనియక—వదలిచనక చెదర ఛంపగ రార॥

24 కాఫీరాగము — ఏకతాళము

శత్రు — నినుమదసూనచెద పలువా-గనుమా
రామునియెడ నీ-రాయిడి చెల్లునె-భూమిని నీవిక బ్ర
దుకవుపో రా-శరం-బిదె-ననున్-మారి పగ వెలసెదురా
పలువా-గనుమా నిను॥
కావరమందుచు నీకొటుహాయమును-లావునబట్టితి
దక్కవు క్రూరాజ-నం-బులన్-గనన్-యిలగూ
ల్చెదరా-కనుమా-నలువా నిను॥

25 కమాజురాగము — ఆదితాళము

శత్రు — బాలక చాలవు-ఆలమునన్
కాలముతీరెను-కానవురా బా॥
లవ — ఏపునచూపుము-శౌర్యములు
ఈపరిమాటలు నోపవురా ఏపు॥
శత్రు — శూలియడరినన్-స్రుక్కణగింతు
లవ — ఏల-ఇటుల-బీరము-పల్కెదు
కాలుని-చెంతకు-నంపెదను
శత్రు — చాలునునీవిక-చచ్చితిరా
లవ — నీమానము-ప్రాణము-నీగెదురా

26 పీల్ రాగము — ఏకతాళము

సీత — సుకుమార-రణమున చనితే-శోకరభంబే-గతితాళుము ధరనే-
గతినే-మనగలదాన సుకు॥
సొగసగునగవె వె-న్నడుగనుదాన-చెక్కిలినొక్కనే
ముద్దిడుదాన-చెలువొ-పలుకె-న్నడువినుదాన సుకు॥

27 శామకళ్యాణిరాగము — రూపకతాళము

కుశ — వాడెవ్వాడు-నొంతునేడు-పట్టితెత్తు పేరువాకి
పాదముచేర్తు నే-ప్రాణములతీర్తు నే వా॥
ఇంద్రుడైన-యుపేంద్రుడైన-మించిద్రుంచి నొంచివైతు శోక
మేలనమ్మరో-వీకపంపుతల్లిరో వా॥

28 కాఫీరాగము—ఆదితాళము

కుశ—ఏపలువా–కొనుచుచనెనో–పలుకుడికనేవాని॥
మదమణుతున్ ఏపలువా॥
పటుతర–శరముల–పాయగజేతున్
పటుతర–యురమును–చీలగజేతున్ ఏపలువా॥
అటునిటుకదలక–పదములవిడుతుగా ఏపలువా॥

29 తోడిరాగము—ఏకతాళము

కుశ—ఓరోరోరీ–నిలునిలుమిక బాగ–రడిచెదభూమిపరణమందున్
కరింబునిటునిన్–విరోధగతిచే ధరిణ పడగన్
మడియింతున్ ఓరో॥

శత్రుఘ్న—బాలా–మేలా
కుశ—పోరన్–రారా
శత్రుఘ్న—బాలూడ. నీలాగు–అంబు–చేయంక–చాలుదె
బాలక–పోలునేరా॥
కుశ—ఇటులన్–పలుకగ–నగునే–పోగరే॥
శత్రుఘ్న—వైరంబునీ–కేమయినన్–పోరాడగా–ధీరుండవే
నీవు–శూరుండవే॥ ॥ఓరో॥

30 కళ్యాణిరాగము—ఏకతాళము

లవ—సమరమందు–శౌర్యమున్–మీరన్–చూపుమా–ఓపుగా
కుశ—సవనవాజినాజిలో–శక్తిచూపనిత్తుము సమర॥

31 కళ్యాణిరాగము—ఏకతాళము

లక్ష్మణ—బాపలేటికిమీకునీగతి–బవరమును–చాలింపుడు
సైపలేదు ప్రతాపవహ్ని ని–చటులబాణపరంపరల్ బా॥

32 కళ్యాణిరాగము—ఏకతాళము

లవ—నృపులకెందుయుద్ధమే సామ–మోక్షమా ధర్మమా
కుశ—నృపుడక్షత్రియుండవు నీకు జెప్పువారమే నృపు॥

33 కళ్యాణిరాగము—ఆట తాళము

లక్ష్మణ— మీరు క్షత్రియులౌదురే-మిము గన్న ధన్యులింకెవ్వరు
మిమ్ము గన్నయాశమ్ము నొందిన-మేటివంశము నేదొకో

34 కళ్యాణిరాగము—ఏక తాళము

లవ—కులమునామము పేరు నీ కేలా-బంధువీవాడవే
కుశ—వినుము జన్మపత్రికల్ - వేడ్క-వ్రాయువాడవే కులము॥

35 కళ్యాణిరాగము—ఏక తాళము

లక్ష్మణ—వీర క్షత్రియులైన శూరుని-బలము నీవు యోచింపుము
తారతమ్యమెఱుంగకిట్టుల-మీరినిల్వగ పాడియే వీర॥

36 బిలహరిరాగము—ఏక తాళము

లక్ష్మ—పుడమిపడగ-వేయజాలనే
కుశ—పోగరా
లక్ష్మ—తగురా ?
లవ—నగరా ?
లక్ష్మ—బాలులంచు నూరకుంటి
కుశ—ఏలగర్వమడరెనీకు
లక్ష్మ—నిలుము నిలుము-పలుకులార్చెదర్
లవ—చనుమా
లక్ష—వినుమా కుశ—కనుమా
లవ—పలుకులేల పనుపుబాణముల్
కుశ—మెచ్చన్-వచ్చిన్-నిన్నున్
లక్ష—శరములింక నురము వెడలి ధరణిచేరు చూడరా
తరమె నిలువ-రణము సేయగా-కలరా-మీరగలరా

37 హిందుస్థానీరాగము—ఏక తాళము

లక్ష—వీరుడైన శక్తియున్న-యుద్ధమందు జోరజాలి-బిల్వుమా
కుశ—బీరమేల బాలలంచు-పల్క-నేల ధీరుడౌచు-పోరుమా
లక్ష్మ—కాలాహితో వైరమేల-కాలంబుతీరినదిగా
లవ—ఈలాగు ప్రేమంబునీకేలనూ—చాలించి గ్రక్కొమ్ము - బాణంబులన్

లక్ష్మ— ప్రాణంబ-సంగ-మా-నోను చూడుమీ-మన- లేరు చూడుమీవీరు

ఇంగ్లీషునోటు — ఏకతాళము

అంజ— ఇదె ధరన్ బడల్ నడంతునింటె దుష్టులన్
ఖరులనొంతు-ద్రుంతుమింగు-సంతోనొంద జేసెదన్
ఏ-పా-రఁ-దైత్యాలిట్టుకట్టడిఁ
వలుపదలచి- కలతపరచి-ఖలతసలిపిరే ॥ఇదే॥

59 కళ్యాణిరాగము—ఏకతాళము

అంజ— నేనెందు కానరైతి-జానకిఁ కానరైతి
దీనతనొందనాయె-ప్రాణంబు నూననాయె
శ్రీరాము నెటుగాంతు-యేముని విన్నపింతు- నేనెందు॥

41 ఇంగ్లీషునోటు—రూపకతాళము

అంజ—పడుడిందూరక

శూర్ప / కరా } విడుమమ్మూరక

అంజ—పాపాత్ములైతిరి

కరా / శూర్ప } తప్పులసైరింపు

అంజ—మెడనలిమెద మిమ్మింక

కరా / శూర్ప } దయవిడుము మ్రొక్కెదము

అంజ—పలుకకుడీ తొలుపల్

కరా / శూర్ప } ఘనకరుణనుమనుపుము

శంకరాభరణము—ఏకతాళము

లవ—రామా రామా-రఘువర రామా-రాఘవ రామా
దానవభీమా-జగదభిరామా-తారకనామా
దశరథ రామా ॥రామా॥

43 శంకరాభరణరాగము — ఏకతాళము

ప్రేమధామా—మునిజనసోమా—సురుచిరధామా
మునిజనధామా వేదారామా—వైకుంఠధామా రామా రామా॥

బేహాగ్ రాగము — ఆదితాళము

కుశ—జనకా—ప్రేమనిమ్మా—తనయుల మము చేకొమ్మా
లవ—తండ్రివౌ మాదగు— తప్పులసైరించి—తనరి దయ
రానిమ్మా జనకా॥
కోపము చేసిటు—పాపము చేసితి—కొమరుల
మము జేకొమ్మా జన॥
సీత—కరుణించి పాలింపుగా—ఆలింపుగా—నాథా కరు॥
ఎన్నుచు నీమది—మన్నన జేయవె—సన్నుత రఘుమణి
న్యాయమా—భారమా—ఉదారమా
గంభీరమా—నాథా కరు॥

44 పూరికల్యాణిరాగము — ఆటతాళము

రామ—కామినికరుణింపవు—కాంతరో నీకిటు
సంతాపము చేకూర్చితి॥
జానకి ఈ కానలం బోనడిచిన హీనుడనే
మానక కాపాడవె—సీత భూమిజాత యిటు కా॥

45 మోహనరాగము — ఏకతాళము

కమలా—నాథా—విమలవిభా—కమలా—వాసా కలుషహరా
ప్రముదా—భాసా—వరఫలదా—కమలా—నాభా—ఘనకరుణా।
కరివరదా—సురవినుతా—హరివదనా—మురహరణా—సురు
చిర—నార—దాదివంద—నీయ—శ్రీ కమ॥
సామలోలా—సాధుపాలా—వేదలీలా—సారలీలా భాను
జాల—మందరధారణా—మానిభావన—కారణా సత్కరు
ణా—సు—బ్రహ్మ—ణ్య—వందితా కమ॥

మంగళము.

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.

# చరిత్రలు - కథలు

| | | |
|---|---|---|
| శ్రీనాథకవి చరిత్ర | 1 | 0 |
| వేములవాడ భీమకవి | 0 | 12 |
| శ్రీకృష్ణ దేవరాయలు | 0 | 12 |
| నలమహారాజు కథలు | 0 | 12 |
| భోజకాళిదాసు కథలు | 1 | 0 |
| భట్టివిక్రమార్కుని కథలు | 1 | 8 |
| డిటో చిన్నసైజు | 0 | 12 |
| స్త్రీల వ్రతకథలు 1, 2, 3 భాగములు | 1 | 0 |
| పాండవ వనవాసము | 1 | 0 |
| కాశీక్షేత్ర మహాత్మ్యము | 1 | 0 |
| మహాపతివ్రతల కథలు | 1 | 0 |
| మదనకామరాజు కథలు | 1 | 0 |
| తెనాలి రామకృష్ణ చరిత్ర | 1 | 0 |
| శ్రీరామ వనవాసము | 1 | 8 |
| పరమానంద శిష్యుల కథలు | 0 | 8 |
| హరిశ్చంద్ర వచనము | 0 | 12 |
| మైరావణ చరిత్ర పెద్దది 200 పేజీలు | 1 | 8 |
| అభయరాఘవము | 0 | 12 |
| సౌభ్రాత్రరాఘవము | 0 | 12 |
| నారదుని కథలు | 1 | 0 |
| గరుడపురాణము వచనము | 0 | 12 |
| గులేబకావళి కథలు | 1 | 0 |
| అభిమన్యుని యుద్ధము | 1 | 8 |
| బమ్మెర పోతనకవి చరిత్ర | 0 | 12 |
| పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితము | 1 | 8 |

# ఆంధ్రనాటకములు

| నాటకము | రూ. | అ. |
|---|---|---|
| చింతామణి | 1 | 12 |
| వరవిక్రయము | 1 | 8 |
| పద్మవ్యూహము | 1 | 8 |
| చిత్రాంగి | 1 | 8 |
| సత్యహరిశ్చంద్రీయము | 1 | 12 |
| సావిత్రి | 1 | 8 |
| కనకతార | 1 | 8 |
| సతీ తులసి అను తులసీదేవి | 1 | 8 |
| సక్కుబాయి | 1 | 8 |
| కృష్ణలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| మేవాడు [illegible] | | 8 |
| విభీషణ పట్టాభిషేకము అను లంకాదహనము | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| సామ్రాజ్యపట్టాభిషేకము అను రామరావణ యుద్ధము | 1 | 8 |
| మహాకవి కాళిదాసు | 2 | 0 |
| రేవతి | 1 | 8 |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| ప్రసన్నయాదవము (నరకాసురవధ) | 1 | 8 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| చతురచంద్రహాస | 1 | 8 |
| బొబ్బిలియుద్ధం | 1 | 8 |
| అమరజ్యోతిఅను పల్నాటియుద్ధం | 1 | 8 |
| మాధవశర్మ (నోవల్) | 1 | 8 |
| ఝాన్సీరాణి (చరిత్రాత్మకం) | 1 | 8 |
| జన్మభూమి డిటో | 1 | 8 |
| మాయలమరాఠి (బాలనాగమ్మ నాటకము) | 1 | 8 |
| అల్లూరి సీతారామరాజు పితూరి | 1 | 8 |
| రసపుత్ర విజయము | 1 | 8 |
| వేణీసంహారము | 1 | 8 |
| మోడరన్, బి. ఏ. | 1 | 8 |
| రాధాకృష్ణ | 1 | 8 |
| కులంలేని పిల్ల | 1 | 8 |
| కన్నకొడుకు | 1 | 8 |
| సారంగధర | 1 | 8 |
| శాంతామతి | 1 | 8 |
| కన్యాశుల్కము | 2 | 8 |
| ఆంధ్రజ్యోతి | 1 | 0 |
| జహ్వారిబాయి అను రోషనార | 1 | 8 |
| కాలేజి గరల్ | 1 | 8 |
| ఎక్స్ కాలేజి గరల్ | 1 | 8 |
| ఫోర్ రాస్కెల్స్ | 1 | 8 |
| సాయీబాబా | 1 | 8 |
| తెనుగుతల్లి | 1 | 8 |
| ఆకలిమంట | 1 | 8 |
| కష్టకాలం | 1 | 8 |
| మహారథి కర్ణ | 1 | 8 |
| విశ్వస్వరాజ్యం | 1 | 8 |
| ఛత్రపతి శివాజీ | 1 | 8 |
| వీరాభిమన్యు | 1 | 8 |
| ద్రౌపది | 1 | 8 |
| అనార్కలి | 1 | 8 |
| అహల్య లేక పాషాణి | 1 | 8 |
| మీరాబాయి (చరిత్రాత్మకం) | 1 | 8 |
| తెఱచాటు (సాంఘికం) | 1 | 8 |

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, బుక్ సెల్లర్సు, రాజమండ్రి.